# ధ్యానమంజరి

CHECKED-75

"యెహోవా నాఆశ్రయ దుర్గమా, నా విమోచకుడా నా నోటిమాటలును, నా హృదయ ధ్యానమును నీ దృష్టికి అంగీకారములగునుగాక : దా. కీ 19 : 14;"



గ్రంథకర్త:

యన్. ఇశ్రాయేలు

తెనాలి

ది ఇండియా బైబిలు మిషను (Regd. 1938)
పోరోసు ఆఫీసు (రాజమండ్రి H. O.)

సర్వహక్కులు గ్రంథకర్తవి } 15-5-1960 వెల 0—8—0

# వి ష య సూ చి క

# పరిచయ పంచరత్నములు

శా॥ శ్రీదేవా! పరలోకదివ్యమహిమా-శీనుండ! రాజ్యంబు, సం
పాదించన్గడుదూరమేగి మముఁగాపాడంగరానుండి, నీ
వేదోక్తుల్ ప్రకటించుడంటివిగదా వేవేలకున్ బృద్ధ్యలోఁ
బాదాబ్జంబులఁబట్టి వేడెదను సంభావింపు మా మంజరిన్

ఉ॥ పిన్నవయస్సునుండి నడిపించి సమస్త విపత్తులందు, ఆ
పన్నశరణ్య! శ్రీకర! అపారకృపామతి "నిశ్రయేలునిన్"
సన్నిధితోడునుంచి ఘటసత్ప్రచరిత్రయెగాక నిప్పుడున్
జెన్నుగ "ధ్యానమంజరి" రచింపగఁజేసిన దేవస్తోత్రముల్

చం॥ మరణపయోధినైన దుమమాడుసజీవశరంబు, లోక, దు
ర్నరదురితంబునంతయు వినాశమొనర్చెడునగ్ని, దివ్యస
చ్చరిత పవిత్రభక్తహతసాత్వులకియ్యది మార్గదర్శి, సు
స్థిరసుఖసంత సంబరయజేసెడి ప్రార్థన "ధ్యానమంజరే"

కం॥ "ధ్యానమ్మౌ" ప్రభుసేవ, ప్ర
ధానమ్మని ఎంచి సన్ని - ధానమున, సమా
ధానమ్ముగ ప్రార్థించు, వి
ధానమ్మునుఁ దెల్పువారి-ధాతామాతా!

కం॥ ప్రతదినఁ ప్రతిష్ఠఁజేయుగ
ప్రతిదినమును సత్యస్తోత్ర - ప్రార్థనలరయున్
వెతలొందక, నెగురగ, స
మ్మతితోడఁ బఠించు "ధ్యాన-మంజరి" జయమౌ,

రచన:

రెవ. కె. ఇశ్రాయేలు

విజయవాడ

# దైవ స్తుతి

దేవాత్మ ప్రభునీకు-దినదిన స్తుతులు=నా విన్నపము విన్న-నాథా సంస్తుతులు।దేవా।

1. అపవిత్రాత్మల దర్శన - మాపియున్నావు = ఎప్పుడైనా - అవినా - కేసికానీయవు ॥దేవా॥
2. చెడ్డ ఆత్మల మాటల్ - చెవిని బడనీయవు = గద్దుపలు కుబ నోళ్ళు - గట్టియున్నావు ॥దేవా॥
3. చెడు తలంపులు పుట్టిం - చెడి దుష్టాత్మలను నా = కడకు రానీయవు - కదలనీయవు ॥దేవా॥
4. పాపంబులను దూర - పరచి యున్నావు=పాపంబులను గెల్వ - బలమిచ్చినావు ॥దేవా॥
5. పాపఫలితము లెల్ల - పారదోలితివి = శాపసాధనములు - ఆపివేసితివి ॥దేవా॥
6. దురిత నైజపు వేరు - పెరికియున్నావు=పరిశుద్ధ నైజసం- పద యిచ్చినావు ॥దేవా॥
7. ప్రతివ్యాధి నిన్ స్వస్థ-పరచియున్నావు=మతికి ఆత్మకును నె- మ్మది యిచ్చినావు ॥దేవా॥
8. అన్న వస్త్రాదుల - కాధారమీవె = అన్ని చిక్కులలో స - హాయుండవీవే ॥దేవా॥
9. ననుగావగలదూత-లనునుంచినావు=నినునమ్ము విశ్వాస- మును నిచ్చినావు ॥దేవా॥
10. సైతాను క్రియలకు - సర్వనాశనము = నీ తలంపుల కెల్ల నెరవేర్పు నిజము ॥దేవా॥
11. సర్వంబులో నీవు - సర్వమైయున్నావు = నిర్వహించితివి నా - నిఖిలకార్యములు ॥దేవా॥
12. జనక కుమారాత్మ - లను త్రైకుడొందు = ఘనతకీర్తి మహిమ-చనువు నాయందు ॥దేవా॥

(బ్రాదర్ యం. దేవదాసు అయ్యగారిది.)

# ధ్యానమంజరి

## దైవసన్నిధి

### "నీవుపోయి యెహోవా సముఖమందు నిలిచియుండుము"

### 1 రాజు 19 : 11

యెహోవాను వెదకుడి. ఆయన బలమును వెదకుడి. ఆయనసన్నిధిని నిత్యమువెదకుడి. దా. కీ. 105 : 4. ఘనతాప్రభావములు ఆయన సన్నిధిని ఉన్నవి. దా. కీ. 96 : 6; బలసౌందర్యములు ఆయన పరిశుద్ధ స్థలములో నున్నవి. 1 దిన 16 : 11; 27.

సన్నిధిఅనగా దేవునితో యుండుట. హానోకు దేవునితో నడచెను. ఆది 5 : 21 - 24; హెబ్రీ 11 : 5. నోవాహుదేవునితో నడిచెను. ఆది 6 : 9 అబ్రహాము దేవునిసన్నిధిలో నిందారహితుడై నడిచెను. ఆది 17 : 1; ద్వితీ 13 : 4 శిష్యులు యేసుతో కూడ నుండినందున పండితులైరి. అ. కా 4 : 13 దేవుని సముఖమునందు నివసించుటయే సన్నిధి. యిది మనకును దేవునికిని సన్నిహిత సంబంధ బాంధవ్యమును ఋజువుపరచు సహవాస జీవితమై, యున్నది. ప్రక 3 : 20 యోహా 14 :23. మనసహవాసమైతే తండ్రితో కూడను, ఆయనకుమారుడైన యేసుక్రీస్తుతో కూడను ఉన్నది. 1 యోహా 1 : 3 మనప్రభువైన యేసుక్రీస్తును తన కుమారుని సహవాసమునకు మిమ్మును పిలిచిన దేవుడు నమ్మతగినవాడు. 1 కొరి 1 : 9; 1 యోహా 2 : 24 ఆ తేయి నీ సహవాసమేమైయున్నది. ఆదాము పోగొట్టుకొనినమహిమా ప్రభావములతో నిండిన దైవసన్నిది క్రీస్తుద్వారా మనకులభించుచున్నది. యిహసంబంధమైన నిధులన్నిటికంటెను, దేవుని సన్నిధి సంపూర్ణ సంతోషముగల శ్రేష్టధననిధి వంటిది. దా. కీ 16 : 11; 17 : 15. సన్నిధి ఒక గనివంటిదె. ఈగనినుండి ప్రార్థించుట, స్తుతించుట, కనిపెట్టుట ద్వారా సమస్తమును పొందగలము. యాకోబు దేవునితో పోరాడి దీవెనపొందిన స్థలమునకు "పెనూయేలు" అను పేరుపెట్టెను. పెనూయేలనగా దేవుని సన్నిధి అని అర్థము. ఆది 32 : 29,30 హోషె 12 : 3, 4, నీవు ఆశీర్వదింపబడవలెనంటే పెనూయేలు సహవాస, పోరాటము సలుపవలెను. దేవుని సన్నిధి ఆశీర్వాదకరమైనది, సమాధానకర

---

మైనది, జయముతో కూడినది, సంతోషానంద సమృద్ధి ఆదరణ కలిగించును. న్యాయా 6 : 22; 23; 13: 23, 24; దా. కీ. 21 : 6, 4; 3 : 4; 36 : 8

“నీ ఆవరణములలో ఒక దినము గడుపుట వెయ్యి దినములకంటె శ్రేష్టము” దా. కీ 84 : 10. దావీదుభక్తుడు తన జీవితకాలమంతయు దేవుని సన్నిధిలో నివసింపగోరుచున్నాడు. దా. కీ. 27 : 4; 23 : 6. నీవుకోరునది ఏమి ? అబ్రహాము ఎండవేళ సింధూరవనములో గుడారపు ద్వారమందు (సన్నిధిని) కూర్చుండి యున్నప్పుడు యెహోవా అతనికి కనబడెను. ఆది 18:1 మోషే సీనాయి పర్వతముపై నలుబదిదినములు దైవసన్నిధిని గడిపినందున అతని ముఖము ప్రకాశించెను. నిర్గమ 34 : 29-35; 2 కొరి 3 : 8-18 క్రీస్తు ఆయన సన్నిధి జీవితముగలవారిదీన శరీరములను ఆయన మహిమగల శరీరముగా మార్చును. నిర్గ 33 : 21లో “నాసమీపమున ఒక స్థలమున్నది. నీవు ఆబండ సందులో నిలిచియుండవలెనని” దేవుడు మోషేతో సెలవిచ్చెను. ఆ సమీపస్థలమే ప్రభువుసన్నిధి. ఆబండయే క్రీస్తు. ఆబండ సందులే (గుహలు) నీకొరకు కార్చిన రక్తగాయములు. ప్రభువుప్రసన్నత నీకు ప్రాప్తించునంతవరకు ఆయన సన్నిధిలో మోకరించి సమస్త అపరాధములు ఆయన రక్తముచే కడుగబడువరకు వేచియుండవలెను. సన్నిధికాంతి నీమీద ప్రకాశించును. ఎఫె 5 : 14; యెష 60 : 1

సూర్యుడు తన ప్రకాశమునందిమిడియున్న వర్ణములు (రంగుల) ను నిష్కళంకమైన పుష్పసమూహములకేలాగు సద్దినలంకరించునో అట్లే నీతి సూర్యుడైన క్రీస్తు మలాకీ 4 : 2. తన మహిమా ప్రభావ శుభలక్షణ స[illegible] దాయముల పుష్పములవంటి సదయంబగు, మృదువైన హృదయము సన్నిధిస్థలమున అద్దును. పచ్చని ఆకులను భక్షించు క్రిమికీటకాదులు అదేరంగు బడసినట్లు, ఉత్తరధృవమందు వసించు నెలుగుబంటి తెల్లనిదగా నుండునట్లు, కోడిక్రింద నున్న గ్రుడ్లు ఇరువదిఒక దినములలో చూడగా కోడిస్వరూపంబొందునట్లు క్రీస్తుసన్నిధి నపేక్షించువారందరిని ఆయన స్వారూప్యమునకు సమరూపముగల వారినిగా మార్చును. శీతోష్ణస్థితినిబట్టి ఆకాశము, రంగు, గుణములెట్లు మారునో ఆలాగే ప్రభువు సన్నిధానపరులు రూపాంతరము పొందుదురు. రోమా 8 : 29; 1 కొరి 15 : 49; ఫిలి 3 : 21; కొల 3 : 10 - 1 యోహా 3 : 2. ఏలియా నేను దేవుడైన యెహోవా సన్నిధిని నిలువబడియున్నానని అనుచున్నాడు 1 రాజు 17 : 1 మరి నీవు నిలుచుస్థలమేది ? పాపుల మార్గమున నిలుచుచున్నావేమో? కీర్త 1 : 1; 17 : 4; 119 : 104. తప్పిపోయిన కుమారుడు ఉన్నపాటుననే తండ్రి సన్నిధికి వచ్చెను. లూక 15 : 20; 21.

“దేవా! దుప్పి నీటివాగులకొరకు ఆశించునట్లు నా హృదయము నీకొరకు తృష్ణగొనుచున్నది.” దా. కీ. 42 1; 63 : 2.

నీవు అస్థిరాగలవా ? ఎంతపాపివైనను యేసు చేర్చుకొనును యోహా 6 : 37 నిత్య విశ్రాంతినిచ్చును మత్త 11 : 28. ఈ సన్నిధియే మహోన్నతునిచాటు సర్వశక్తుని నీడ కీర్త. 91 : 1; పరమ 2 : 3. ఈ సన్నిధిని ఆశ్రయించువారి నే పేటు బీటలనాశ్రయించు నాపావురమా! అని పరమపావురమైన క్రీస్తు పిలుచుచున్నారు. పరమ 2 : 14. పేటుబీటలు అనగా రహస్యస్థలములు. (Secret Places of Stairs) ఎఫె 2 : 18. ప్రభువు సన్నిధి మారావంటి చేదునుసహా మధురముగామార్చును. నిర్గ 15 : 23. నీలో చేదు (పాపము) ను విరిచిమధురముగాను నీళ్లను ద్రాక్షరసముగాను (యోహా 2 : 6) విషభాండమును ఆహారపదార్థముగాను (2 రాజు 4 : 40, 41 హిమమువలె తెల్లగాను మారిపోవును యెష 1 : 18.; 44 : 22; 43 : 25 నీవు నాతట్టుకు తిరిగినయెడల నీవు నాసన్నిధినినిలుచునట్లు నేను నిన్ను తిరిగిరప్పింతును యిర్మి 15 : 19.; 35 : 19 యెహోవాసన్నిధిని ఉంచిన అహరోను కర్రచిగిరించి, పుష్పించి, బాదముపండ్లు కాసెను. సంఖ్యా 17 : 7. 8 అలాగునే దైవసన్నిధిని ఆశ్రయించువారి మరణకరమైన జీవితము నిత్యజీవముగలదిగాను, సువాసనగలదిగాను ( ఎఫె 5 : 2 ) ఫలభరితమైన దానిగాను దేవుడు ఉద్ధరించును. యెష 35 : 1. పక్షిరాజు యవ్వనము క్రొత్తదగుచుండునట్లు, మేలుతో నీ హృదయమును తృప్తిపరచును. కీర్త. 103 : 5. పక్షిరాజు వృద్ధాప్యమందు పనినిచాలించి పర్వతశ్రేణుల నాశ్రయించి, ఆహారపానీయముల విసర్జించి, ముక్కును, రెక్కలను బండకుకొట్టుకొనుచు రక్తమును కార్చివేయును ఎండను, మంచుకు సీతలవాయువులకు చలించక అబండయందే జీవించును. తుదకట్లుండుటచే ప్రాచీన బ్రతుకుగతించి నవక్రొత్తబ్రతుకు పరిణమించును, శిఖానఖ యవ్వనాదులు నూతనమగును. తుదకాఖగము ఖగోళంబు కెగసి నిర్విచారముగా విహరించును.

ఆలాగునే సన్నిధిలో వసించెడివారి ప్రాచీన స్వభావముమారి నూతన బలము అనగా పునరుత్థానశక్తిపూర్ణ బలంబు లగసి గగనంబున కెగసిపోదురు. అలయక పరుగెత్తుదురు. సొమ్మసిల్లక నడచిపోవుదురు. యెష 40 : 31; 60 : 8. యిస్సాకు అనుదినము సాయంకాలము పొలములో దైవసన్నిధిని ధ్యానించువాడు ఆది 24 : 63. "అనుదినము నాయొద్ద కనిపెట్టుకొని, నా ద్వారబంధములయొద్ద కాచుకొని నా ఉపదేశము వినువారు ధన్యులు" సామె 8 : 34. ప్రియుడా ? ఈ అనుదినధన్యత నీకు వున్నదా ? నిద్రించుచున్న శిష్యులను ప్రభువుచూచి ఒక ఘడియయైనను నాతో మేల్కొని యుండలేరా ? అని ప్రశ్నించెను. గాననిద్రించుచుంటివా ? మేల్కొని ప్రార్థించుచుంటివా ? మత్త 26 : 40 దేవుని సన్నిధి మాతోరానిచో నేము ముందుకు సాగము అని మోషే అనగా

'ప్రభువా ! నా పాపములను నీ విస్మృత స్థలముపై నిలుపుము.'

నాసన్నిధి నీతోకూడవచ్చునని అభయమిచ్చి ఆదరించిన (నిర్గ 33 : 14, 15) అద్భుత సన్నిధిగల్గి సాగుము. నీవు దేవుని సన్నిధితోను, దేవునిసన్నిధి నీతోను ఉన్నదా ? యోబుభక్తుడు నరుకబడిన వృక్షపు మొద్దువలెయున్నను జీవజల ఊటయగు దేవుని సన్నిధిలో నివసించినందున గట్టి విశ్వాసము రెట్టింపు దీవెన పొంది, చిగిరించి, పుష్పించి ఫలించెనుగదా యోబు 14:7-9; 42 : 12-16. సంతానరహితమైన స్థితిలోనుండి దూషణలు అవమానములు పొందుచుహన్నా దైవసన్నిధిని కన్నీటితో తనఆత్మను కుమ్మరించెను. 1సమూ 1 : 10 -15. నిన్ను సృజించిన యెహోవా సన్నిధిని మోకరించి నీహృదయ భారమును ఆయన సన్నిధిలో కుమ్మరించుము దా. కీ 95 : 7. స్థిరమనస్సు గలిగి ఆయనను హత్తుకొని యుండినయెడల సంపూర్ణశాంతి గలవారినిగ మన లను కాపాడును. యెష. 26 : 3. సాతాను అపహరించకుండా ఆయన తన రెక్కలతో నిన్ను కప్పును. దా. కీ 21 : 6; కీర్త 91 : 4.

దైవసన్నిధిలో నివసించు సేవకుడు అనేక హృదయములను ఆకర్షించును. మండుచున్న జ్యోతివలె ప్రకాశించును. అట్టివానినుండి దైవశక్తి ప్రవాహముగా ప్రవహించును. రోగులను స్వస్థపరచును. యెండిన హృదయ క్షేత్రములను ఫలింపజేయును. అట్టి వానియందు సాతాను క్రియ చేయలేదు "ప్రార్థన, పాపము చేయకుండా ఆపుచేయును. పాపము, ప్రార్థన చేయ కుండా ఆపుచేయును" అని మహాభక్తుడు జాన్ బన్యన్ వ్రాసెను. సన్నిధి ప్రార్థనా సహవాసము కలిగినవాడెప్పుడును దహించు అగ్నివలె మండుచున్నందున సమస్తకీడును సహించి, జయించుట తధ్యము. నిష్ట వృద్ధియై మష్టురాలి శ్రేష్టుడగును. నీతిమంతులు తమాలవృక్షమువలె మొవ్వ వేయుదురు....వారు యెహోవామందిరములో నాటబడినవారై మన దేవుని ఆవరణములో వర్ధిల్లుదురు. దా. కీ 92 : 12-15 నీసేవకుని కుమారులు నిలిచి యుందురు. వారి సంతానము నీసన్నిధిని స్థిరపరచబడును. దా. కీ 102 : 28; 69 : 36; 89 : 4 గాన దైవసన్నిధి సన్నిహితమైనది. సత్య, శాంత, ఆత్మానంద సంపూర్ణ ప్రత్యక్షతాపూరితమై ఒప్పారెడి ఆయన సన్నిధికి సంతోషించుచురండి. దా. కీ 100 : 2 ద్వితి 12 : 11; 12. దా. కీ 95 : 2 "తమను తాము ఉపేక్షించుకొనుటకు, దైవసన్నిధియందు దుఃఖించుటకు, ఆయనదీవెనల కొరకు సుదీర్ఘముగాను, సహృదయముతోను, ప్రార్థన చేయుటకు, ఎవరు ఇష్టపడరో వారు దానిని పొందరు. "దేవునితో పోరాడుట" దీనిభావము బహు కొద్దిమంది మాత్రమే యెరుగుదురు - బహు కొద్ది మందిమాత్రమే తమ ఆత్మలను దేవునికి అంకితము చేసిరి"

గ్రేట్ కాంట్రవర్సి. పుట 621.

---

"ప్రభువా ! నన్ను నీ హృదయానుసారమైన మనుష్యునిగా చేయుము."

# దైవధ్యానము

## ఆయననుగూర్చిన నాధ్యానము ఆయనకు ఇంపుగానుండునుగాక!

కీర్త 104 : 34 రాత్రి జాములయందు నిన్ను ధ్యానించునప్పుడు క్రొవ్వు, మెదడునాకు దొరికినట్లుగా నాప్రాణము తృప్తిపొందుచున్నది. దా.కీ 63 : 6. గాన, యేసునుధ్యానించుటవలన ఎట్టిపాపమైనపోవును, ఎట్టివ్యాధియైన కుదురును. ఎట్టిభీతియైనతొలుగును ఎట్టికష్టమైనయుండదు. ఎట్టికొమియైన తీరును. ఎట్టినిందయైన తొలగును ఎట్టిచింతయైనను, నిరాశయైనను, అజ్ఞానమైనను, దుఃఖమైనసుఅంతమొందును అప్పులైనను తీరును. వాజ్యమైనను గెలుచును. కలహమైనను ఆగును. వట్టిమాట వట్టిదగును. ప్రాణమునకు త్రాణపుట్టును. క్రీస్తు నామస్మరణవలన సమయముపోదు. విశ్రాంతిపోదు. పని వెనుకబడదు. సుఖముతగ్గదు. ఏమియుఖర్చుకాదు. యేసునిధ్యానించుటవలన వాస్తవంబు బయలుపడును. స్వస్థిస్థితులు దొరకుచుండును. కోరికలన్నియు సిద్ధియగును. ఆలోచనలన్నియు సఫలమగును (కీర్త 20 : 4) సుస్థిరంబగు భక్తియబ్బును. ప్రశస్తభోజనము లభించును. పస్తుఅనియెడి బాధయుండదు. ఆస్థిపరమునందుయుండును. యిట్టిధ్యానము కలిగియున్నవారితో దేవుడు స్వరముద్వారాగాని, వాక్యముద్వారాగాని, వ్రాతద్వారాగాని, దర్శనముద్వారాగాని, స్వప్నముద్వారాగాని తనచిత్తమును బయలుపరచును. అట్టి జీవితము నీరుకట్టిన తోటవలెను. కస్తూరి పుష్పమువలె పూయుచు ఫలభరితముగానుండును. దా. కీ. 28 : 7 యెహోవా రాత్రివేళ నీనామమును స్మరణచేయుచున్నాను. దా. కీ 119 : 55 మహోన్నతమైన నీప్రభావమహిమను నీఆశ్చర్యకార్యములను నేను ధ్యానించెదను. దా. కీ. 145 : 5; 143 : 5; 1 : 2. 119 : 97; 48, 27, 77, 6-యెహో 1 : 8. యెహోవా నాఆశ్రయదుర్గమా, నావిమోచకుడా, నానోటి మాటలును నాహృదయ ధ్యానమును, నీదృష్టికి అంగీకారములగునుగాక ! కీర్త 19 : 14.

# దైవప్రార్థన

## నీ ప్రార్థనలన్నియు యెహోవా సఫలపరచునుగాక

కీర్త 20: 5. 1 సమూ 1 : 17 నీయింటిలో నొకగదిని సన్నిధిగదిగా ప్రతిష్టచేయుము. శుభ్రముగా స్నానముచేసి ఉతికిన వస్త్రములుధరించి, ఆగదియందు ప్రార్థించుట కారంభించుము మత్త6 : 17. స్తుతించుచు, కనిపెట్టుము వాక్యమును ధ్యానించుము ప్రార్థనాదినుండి అంతమువరకు నీయెదుట దేవుడు ఉన్నాడనియు, ప్రార్థనకు తగినఫలము దయచేయుననియు నమ్మవలెను. హెబ్రీ

---

"మా ప్రభువగు ఓ ఇమ్మానుయేలూ, మాయొద్దనుండుము. మాతో నివాసము చేయుము. ఆమెన్"—జాన్. జే. బంటింగ్.

11 : 6; 7:19 యాకో 1:6. నీవు ప్రార్థనచేయునప్పుడు నీగదిలోనికి వెళ్ళి తలుపు వేసి రహస్యమందున్న నీ తండ్రికి ప్రార్థనచేయుము అప్పుడు రహస్యమందు చూచు నీతండ్రి ప్రతిఫలమిచ్చును. మత్తై 6 : 6. గనుక నీవు దైవసన్నిధిని ఉన్నరీతినే మోకరించి పాపివని గ్రహించి ప్రార్థించుటకు పెదవులు తెరువుము. మరి దేనినిగూర్చియు ప్రార్థింపకుము గాని నిన్ను గూర్చియు, నీ పాపములను గూర్చియు, పశ్చాత్తాపముతో క్షమాపణ దొరకు వరకు కలువరి రక్తధారలలో కడుగ బడువరకు మనోవేదన రోదనగల్గి ప్రార్థించుము. యోవే 2:12 యాకో 4:8;9 తెలిసిన ఏపాపమునైనను అంతరంగమున రహస్యముగా దాచియుంచ కుము దేవుడు హృదయములను పరిశోధించువాడు ఆయనకు మరుగైనదేదియు లేదు "నీముఖకాంతిలో మారహస్యపాపములు కనబడుచున్నవి." అనియున్నది దా. కీ 90 : 8; యిర్మి 16 : 17; 32 : 19; యోబు 34 : 21 యిర్మి 17 : 10 సామె 5 : 21; 15 : 3. గాన ఒప్పుకొని క్షమాపణ కోరుము. నాహృదయములో పాపమును లక్ష్యము చేసినయెడల ప్రభువు నామనవి ఆలకింపక పోవును. దా. కీ 66 : 18 నారొమ్ములో పాపమును కప్పుకొనినయెడల నరు మునవున్న రేవునిదృష్టికి నేను వేషధారినగుదును. యోబు 31 : 33, 34. అతిక్రమములు దాచిపెట్టువాడు వర్ధిల్లడు వాటిని ఒప్పుకొని విడిచిపెట్టువాడు కనికరముపొందును. సామె 28 : 13 గనుక చదువరీ! రక్షణ శృంగమైన క్రీస్తును ఆశ్రయించి క్షమాపణకోరుము. తమ్మును తాము తగ్గించుకొని, ప్రార్థనచేసి నన్నువెదకి తమ చెడుమార్గములు విడిచినయెడల పరమండలమునుండి నేను వారిప్రార్థనలువిని వారిపాపములను క్షమించి వారిదేశమును స్వస్థపరచెదను. యీస్థలమందు (సన్నిధియందు) చేయబడు ప్రార్థనలమీద నాకనుదృష్టి నిలుచును. నాచెవులు దానిని ఆలకించును. 2 దిన 7 : 14, 15 యాకో 4 : 8-10. 2 దిన 6 : 20, 40. మనపాపములను మనము ఒప్పుకొనిన ఎడల ఆయన నమ్మదగినవాడును, నీతిమంతుడు గనుక ఆయన (క్రీస్తు) మనపాపములను. క్షమించి యేసురక్తము ప్రతిపాపము, దుర్నీతినుండి మనలను పవిత్రులనుగా చేయును. 1 యోహా 1 : 7, 9. ఎఫె 1 : 7 కొల 1 : 14; 1 తిమొ 1 : 15; 1 పేతు 1 : 18, 19 అ. కా 5 : 31; 10 : 43; 1 యోహా 2 : 2 రోమా 10 : 13. శరీరానుసారమైన మనస్సు పాపమును అంధత్వమును విగ్రహపూజుచున్న దుష్టత్వమును మరణయుక్తమునై యున్నది. యిట్టిమనస్సు పశ్చాత్తాపము కలుగజేయదు. కొందరు కూటములయందు దుఃఖపడుదురే గాని పాపమును విడిచిపెట్టి మారు మనసు పొందరు. అట్టివారి విషయమై పరి॥ పౌలు" మీరు దుఃఖపడితిరని సంతోషించలేదు గాని మీరు దుఃఖపడి మారుమనసు పొందితిరని యిప్పుడు సంతోషించుచున్నాను. దైవచిత్తాను

---

"ఓ ప్రభువా! మానవుల నిజమైన వెలుగువు నీవే. నీవు నేడు మామీద ఉదయించి ప్రకాశించుము."—తామస్ వాట్సన్.

సారమైన దుఃఖము రక్షణార్థమైన మారుమనసును కలుగజేయును. అయితే లోకసంబంధమైన దుఃఖము మరణమును (నరకము) కలుగచేయును. 2 కొరి 7 : 9; 10;అపో 11:18 గాన ప్రియుడా! నీదుఃఖము శరీరాను సారమైనదో, ఆత్మాను సారమైనదో యోచించుము సర్వపాప పరిహార ప్రదేశమైన ప్రభు పాదపద్మములయందు ప్రవిమలంబగు సన్నిధిలోనికి చేరి ప్రభువు నీమారు మనస్సును, రక్షణ వాగ్దానమును నీతో చెప్పువరకు నిజమైన మారుమనస్సు బుజువై "నాకుమారుడా! నాకుమారీ నీ పాపములు క్షమింపబడియున్నవి" అని చెప్పువరకు సన్నిధి గదిని విడిచి పెట్టకుము. మత్త 9 : 2. పౌలు అన్న పానములుమాని మూడుదినములు ప్రలాపముతో ప్రార్థించెను, రక్షింపబడెను. అ. కా 9 : 9; 11.

లోకములో అన్నిటికంటె అవసరమైనది. అత్యుత్తమమైనది ఒక్కటే అదిమరియ కలిగియున్నది. అది ఆమెయొద్దనుండి తీసివేయబడదు. లూక 10 : 41, 42 అని ప్రభువు చెప్పెను. అదియే ప్రభుపాదసన్నిధి కీర్త 27:4; 73 : 25; షూనేమీయురాలు ఎలీషానిమిత్తము ఒకగదిని సిద్ధపరచెను. 2 రాజు 4 : 10. అట్లేనీకొరకు ఒక సన్నిధిగదిని సిద్ధపరచితివా? క్రీస్తుతో నీవు, నీతో క్రీస్తు సహవాసము చేయునట్లు సన్నిధిగదియందు నీ హృదయగది సిద్ధపరచుము స్త్రీ తనయింటిలో దీపము వెలిగించి అనగా ఆత్మను వెలిగించుకొని అంతదనుక తండ్రికి వ్యతిరిక్తముగా కనబడు ప్రతి చిన్నపాపము పోవునట్లుఊడ్చి ఆనాథమైన క్రీస్తునకు దొరకునట్లుగా హృదయమును శుద్ధిచేసుకొని సిద్ధపరచుకొని వెదకవలెను. లూక 15 : 8; 12 : 35; మత్త 7 : 7 అప్పుడుక్రీస్తునివసించును. రక్షించి ఆశీర్వదించి పరిశుద్ధాత్మవరములనను గ్రహించి నిన్ను తననామ మహిమకొరకు ఘనమైన పాత్రగా వాడుకొనును. అవసరమైన దొక్కటే అదే ప్రభుపాదసన్నిధి యెహోవా నీగుడారములో అతిథిగా నుండదగినవాడెవడు? ఆయన పరిశుద్ధపర్వతములో నివసింపదగినవాడెవ్వడు? వ్యర్థమైన దానియందు మనసుపెట్టకయు, కపటముగా ప్రమాణముచేయకయు నిర్దోషమైన చేతులును శుద్ధమైన హృదయమును కలిగియుండువాడే అట్టివాడు యెహోవావలన ఆశీర్వాదమునొందును దా. కీ 24 : 3-5; 65 : 4; 15 అధ్యా; 36 : 7, 8. తనయెడల యథార్థ హృదయముగలవారిని బలపరచుటకై యెహోవాకను దృష్టిలోకమందంతట సంచారము చేయుచున్నది. 2 దిన 16 : 9, జెక 4 : 10; యోబు 34 : 21; 22. నేనైతే దేవునిమందిరములో పచ్చని ఒలీవచెట్టువలెఉన్నాను దా. కీ 52 : 8.

---

"నీవు రక్షింపబడునట్లు నీ హృదయములోనుండి చెడుతనము కడిగి వేసికొనుము." యిర్మీ 4 : 14.

# ప్రార్థనా సూత్రములు

నాయందు మీరును మీయందు నామాటలును నిలిచియుండిన యెడల మీకేది యిష్టమో అడుగుడి అదిమీకు అనుగ్రహింపఁబడును యోహా 15 : 7, 16, (2) నానామమునుబట్టి మీరు నన్నేమిఅడిగినను నేను దానినిచేతును యోహా 14 : 14; 16 : 23. (3) అడుగుడి మీకియ్యబడును, వెదకుడిమీకు దొరకును. తట్టుడిమీకు తీయబడును. అడుగు ప్రతివాడును పొందును. వెదకువానికి దొరకును తట్టువానికి తీయబడును. మీరు చెడ్డవారైయుండియు మీపిల్లలకు మంచియీవుల నియ్యనెరిగియుండగా పరలోకమందున్న మీతండ్రి తన్నుఅడుగువారికి అంతకంటె ఎంతోనిశ్చయముగా మంచి నియీవులనిచ్చును మత్త 7 : 7-11 లూక 11 : 9-13. (4) మరియు మనమాయన ఆజ్ఞలను గైకొనుచు ఆయన దృష్టికియిష్టమైనవి చేయుచున్నాముగనుక మనమేమి అడిగినను అదిఆయనవలన మనకుదొరకును. 1 యోహా 3 : 22 (5) నీవు ఆయనకు ప్రార్థనచేయగా ఆయన నీమనవి ఆలకించును. యోబు 22 : 27; 33 : 26 నెహె 4 : 9; (6) అడుగు ప్రతివాడు ఏమాత్రమును సందేహింపక విశ్వాసముతో అడుగవలెను. సందేహించువాడు గాలిచేతరేపబడి ఎగిరిపడు సముద్రతరంగములను పోలియుండును. అట్టిమనుష్యుడు ప్రభువువలన తనకేమైనను దొరకునని తలంచుకొనరాదు. యాకో 1 : 6; 7; (7) కావున ప్రతి స్థలమందు పురుషులు కోపమును సంశయములేనివారై పవిత్రమైన చేతులెత్తి ప్రార్థనచేయవలెను. 1 తిమొ 2 : 8. (8) మీలో ఎవడైనను రోగియైయున్నాడా. అతడు సంఘపుపెద్దలను పిలిపించవలెను. వారు ప్రభువు నామమున నూనెరాసి అతనికొరకు ప్రార్థనచేయవలెను. విశ్వాససహితమైన ప్రార్థన ఆరోగిని స్వస్థపరచును యాకో 5 : 14, 17 (9) దేవుడు తాను ఏర్పరచుకొనినవారు దివారాత్రులు తన్నుగూర్చి మొఱ్ఱపెట్టుకొనుచుండగా వారికి న్యాయముతీర్చడా ! ఆయనవారికిత్వరగా న్యాయముతీర్చును లూక 18 : 7. (10) అందుచేతను ప్రార్థనచేయునప్పుడు మీరడుగుచున్నవాటి నెల్లను పొందియున్నామని నమ్ముడి అప్పుడు అవిమీకు కలుగునని మీతో చెప్పుచున్నాను. మార్కు 11 : 24; మత్త 21 : 22. (11) యెహోవా నామమునుబట్టి ఆయనకు ప్రార్థనచేయువారందరు రక్షింపబడుదురు. యోవేలు 2 : 32; రక్షింపనేరకయుండునట్లు యెహోవాహస్తము కురుచకాలేదు. విననేరకయుండునట్లు ఆయనచెవులు మందముకాలేదు. యెష 59 : 1 (12) తనకునిజముగా మొఱ్ఱపెట్టువారందరికిని యెహోవా సమీపముగానున్నాడు. నేనునీకు ఉత్తరమిచ్చెదను. నీవు గ్రహింపలేని గొప్పసంగతులను గూఢమైన సంగతులను నేను నీకు తెలియజేతును. దా. కీ 145:18; యిర్మీ 33:3; 29 : 12;

---

**"నేను ఆయునయొద్ద ప్రధానశిల్పినై అనుదినము సంతోషించుచు నిత్యము ఆయన సన్నిధిని ఆనందించుచుంటిని." సామె 8 : 30.**

# మొఱ్ఱపెట్టుము నేను నీకు ఉత్తరమిచ్చెదను

**కీర్త 91:15. ఆపత్కాలమున నీవునన్నుగూర్చి మొఱ్ఱపెట్టుము**

నేను నిన్ను విడిపించెదను. నీవు నన్ను మహిమపరచెదవు దా. కీ. **50 : 15**

దా. కీర్త 107 : 6; జఖ 13 : 9. (1) ఇశ్రాయేలీయులు మొఱ్ఱపెట్టగా ఐగుప్తుపాపదాస్యమునుండి దేవుడు విడిపించెను. నిర్గమ 2 : 23; 3:7. (2) మోషేమొఱ్ఱపెట్టగా యెహోవా ఎఱ్ఱసముద్రమును పాయలుగాచేసెను. నిర్గ 14 : 10 - 15. (3) వారుమారానుగూర్చి మొఱ్ఱపెట్టగా మారా (చేదు) మధురముగామారెను నిర్గ 15 : 22-25 (4) ఇష్మాయేలుమొఱ్ఱ దేవుడాలకించి నీళ్లఊటనను గ్రహించి బ్రతికించెను. ఆది 21 : 14-19. (5) సంసోను గాడిదదవడ ఎముకచే వెయ్యిమందిని చంపినందునఅలసి మిక్కిలి దప్పిగొని మరణాపాయ సమములో దేవునికి మొఱ్ఱపెట్టగా దేవుడు గోతినిచీల్చి నీళ్లుదయచేసి బ్రతికించెను. న్యాయా 15 : 15-20; 16 : 28. (6) హిజ్కియా యెహోవా సన్నిధిని శత్రువుల పై జయముకొరకు మొఱ్ఱపెట్టగా జయముదొరికెను. యెష 37 : 14. (7) హిజ్కియాకు మరణకరమైన రోగముకలుగగా అతడు కన్నీళ్లువిడుచుచు మొఱ్ఱపెట్టగా యెహోవా ఆలకించి మరణశాసనమును కొట్టివేసి పదునైదు సంవత్సరముల ఆయుష్యునిచ్చెను 2 దిన 32 : 24; 2 రాజు 20 : 1-6; యెష 38 : 1 - 6. (8) యబ్బేజు, యెహోవానుగూర్చి మొఱ్ఱపెట్టగా దేవుడతడు మనవిచేసిన దానిని అతనికి దయచేసెను. 1 దిన 4 : 10. (9) ఆసా, పూర్ణహృదయముతో యెహోవాకు మొఱ్ఱపెట్టిప్రార్థింపగా యెహోవా గొప్పజయము దయచేసెను. 2 దిన 14 : 10-12. (10) యెహోషాపాతు, భయంకర యుద్ధసందర్భములోయెహోవాకు మొఱ్ఱపెట్టగా దేవుడు శత్రువులచేతినుండి రక్షించెను. 2 దిన 18:31. (11) యెహెజ్కేలు, ఇశ్రాయేలీయుల శేషభద్రతకై మొఱ్ఱపెట్టెను. యెహె 9 : 8. (12) ఇశ్రాయేలీయులు దేవునికి మొఱ్ఱపెట్టగా న్యాయాధిపతియైన ఒత్నీయేలుద్వారా గొప్పరక్షణ ననుగ్రహించెను. న్యాయా 3 : 9. (13) ఏలీయా, విధవరాలుకుమారుని విషయమై యెహోవాకు మొఱ్ఱపెట్టగా ఆ మొఱ్ఱ యెహోవా ఆలకించి చిన్నవానికి ప్రాణము మరల రానిచ్చెను గనుక వాడు బ్రతికెను. రాజు 17:20 - 24; 2వ రాజు 4 : 34; అపొ 20 : 10, 11. (14) నీతిమంతుడైన హేబేలు రక్తముసహా మొఱ్ఱపెట్టగా దేవుడుదిగివచ్చెను. ఆది 4:10 (15)రాజశేఖరుడగు దావీదు అనేకవిపత్కర, విషాద, విరోధపరిస్థితులందు విరివిగా మొఱ్ఱపెట్టివిజయమొందెను. దా. కీ. 86 : 3, 6. 88:1,30:2

---

**"మీరు యేసుప్రభువును పిలిచినయెడల మీ జీవితములో చెలరేగిన భయంకర తుఫానులన్నియు అణచబడి నీలో సంపూర్ణ సమాధానము చేకూరును." — ఓరల్ రాబర్ట్సు.**

102 : 1; 69 : 3; 31 : 17; 34 : 6; 62 : 8; 18 : 6. 36 : 7. 116 :4. 120 : 1. (16) యోబు తనభయంకర శ్రమలలో దేవునికి మొఱ్ఱపెట్టి ప్రత్యుత్తరములు పొందెను. యోబు 12 : 3. ఇట్లు నీవు మొఱ్ఱపెట్టి దేవునినుండి ప్రత్యుత్తరములు పొందుచున్నావా? గాన "ఆ కృపాసనముమీదికి తుఫానువలె ప్రార్థనను పంపుము. అప్పుడు గొప్ప ఆశీర్వాదములు కుమ్మరింపబడును"—జాన్ వెస్లీ.

## స్థిర విశ్వాసముతో ప్రార్థించుము

### మన విశ్వాసమే లోకమును జయించిన విజయము 1 యోహా 5:4

విశ్వాసములేకుండ దేవునికి ఇష్టుడైయుండుట **అసాధ్యము** దేవునియొద్దకు వచ్చువాడు ఆయనయున్నాడనియు తన్ను వెదకువారికి ఫలము దయచేయువాడనియు నమ్మవలెను. హెబ్రి 11 : 6; 12 : 2; దేవుడు సర్వశక్తిగలవాడు. మీకు ఎంత **అసాధ్య** విషయమైనను ఆయనకు సాధ్యమే. నమ్ముట నీవలనైతే నమ్మువానికి సమస్తము సాధ్యము. మార్కు 9 : 23; మత్త 17 : 21; యెహోవాకు **అసాధ్య**మైనదేదైనయున్నదా? యిర్మి 32 : 17, 27 ఆది 19 : 13; లూక 1 : 37; మత్త 19 : 26; గాన నీవు నమ్మినయెడల దేవుని మహిమ చూచెదవు. యోహా 11 : 40; "అవిశ్వాసమువలన దేవుని వాగ్దానమును గూర్చి సందేహింపక దేవుని మహిమపరచి ఆయన వాగ్దానముచేసిన దానిని నెరవేర్చుటకు **సమర్థుడ**నిరూఢిగా విశ్వసించి **విశ్వాస**మువలన బలముపొందిన" అబ్రహామును పోలియుండుము రోమ 4 : 20, 21; యోహా 6 : 29. "**విశ్వాస**ముతో వేడెడివారికి **విశ్వ**మంతయును వీల్పడును" సందేహముకూడదు. పట్టుదలతో గోజాడి ప్రభువుని ప్రార్థించుట శ్రేయస్కరము. వారు **వేడు**కొనకమునుపు నేను ఉత్తరమిచ్చెదను. వారుమనవి చేయుచుండగా నేను ఆలకించెదను. యెష 65 : 24; 58 : 9. ప్రభువుకన్నులు నీతిమంతుల మీదను ఆయనచెవులు వారిప్రార్థనలవైపునను న్నవి. గాని ప్రభువుముఖము కీడుచేయువారికి విరోధముగనున్నది. 1 పేతు 3 : 12; కీర్త. 34 : 15. కాగా నాదేవుడు తన ఐశ్వర్యముచొప్పున క్రీస్తుయేసునందు మహిమలో మీ ప్రతి అవసరముతీర్చును. ఫిలి 4 : 19; 2 కొరి. 9 : 8; మనలో కార్యసాధకమైన తనశక్తిచొప్పున మనము అడుగువాటన్నిటికంటెను ఊహించువాటన్నిటికంటెను. అత్యధికముగా చేయుశక్తిగల దేవునికి మహిమకలుగును గాక ఎఫె 3 : 20, 21; 1 : 3, ఆయనయందు విశ్వాసముంచువాడు ఎన్నటికిని కలవరపడడు; సిగ్గుపడడు. యెష 28 : 16, 1 పేతు 2 : 6; మరియు నీతి

---

"యెహోవా నామము బలమైన దుర్గము, నీతిమంతుడు అందులోనికి పరుగెత్తి సురక్షితముగా నుండును" సామె 18 : 10;

మంతుడు విశ్వాసమూలముగా జీవించును. రోమా 3 : 22హబ 2 : 4; రోమా 1 : 17. గల 3 : 11. హెబ్రి 10 : 38; అయినను క్రియలులేని విశ్వాసము మృతమైనదగును. యాకో 2 : 17, 20; గనుక ప్రియుడా ! క్రియలతో కూడిన విశ్వాసమును, విశ్వాసముతో కూడిన ప్రార్థనా జీవితముగల్గి నిరీక్షణ కలిగి ప్రార్థించుము. నీవిశ్వాసము బలపడునట్లు హెబ్రి 11, 12, అధ్యాయములను చదివి ముందుకుసాగుము యోహా 12 : 46, విశ్వాసములేని విసుకుదల సమయాన విశ్వాసమిమ్మని ప్రార్థించుము. విశ్వమంతటిని కలుగజేసిన దేవుడు నీయందు విశ్వాసమును నూతనముగా జనింపచేయలేడా? విశ్వాసము వలన అన్ని కీడులుపోవును. అన్ని మేళ్లుకలుగును. అవిశ్వాసమున కీడుపోనూ పోదు మేలు రానురాదు. "పైకిచూడుము. పైకిచూడుము నీ విశ్వాసమును వృద్ధిచేసికొనుము. విమోచింపబడినవారి అనంత మహిమాయుత పవిష్యత్తు పొందుటకు, సుదీర్ఘమైన, సంకుచితమైన మార్గముగుండా దేవుని పట్టణద్వార ములలోనుండి మిమ్మును ఈ విశ్వాసము నడిపించును" టెస్టమొనీస్ Vol పుటలు 287, 288.

# నిత్యము మెళుకువతో విసుకక ప్రార్థించుము

లూక 18 : 1. "ఎడతెగక ప్రార్థనచేయుడి" 1 థెస్స 5 : 16.

దైవసన్నిధియందున్న దీపవృక్షము నిత్యము వెలుగుచున్నట్లు ఆయన సముఖమున నీప్రార్థనాదీపము ఆరిపోక నిత్యము వెలుగుచుండనిమ్ము. లేవి 24 : 1 - 4; సంఖ్యా 8 : 2. ప్రార్థనలేనివ్యక్తి సంపూర్ణుడు కాజాలడు. ప్రార్థన ద్వారా నీ జీవితముమారినట్లే నీ జీవితముద్వారా నీ ప్రార్థనయు మారును. ప్రార్థన జీవపు ఊటవంటిది. అట్టి శాంతికరమైన జలములచే నీ ప్రాణమునకాయన సేదదీర్చును. దా. కీ 23 : 2. ప్రార్థనలేని క్రైస్తవ జీవితము నీరులేని పైరువంటిది. ఫలములులేని వృక్షమువంటిది. అట్టివారిని గూర్చి క్రీస్తు ఏమియుఎరుగడు. మండుచున్న ధూపవేదికపై అగ్నిలో సుగంధ ద్రవ్యములువేసినప్పుడు అది యెహోవాకు అందుండివచ్చిన ధూపము యింపైన సువాసనగానుండెను. నిర్గమ 30 : 34-38 లేవి 16 : 12, 13. అధూపవేదిక అనగా దైవసన్నిధి. అందున్నఅగ్ని అనగా దహించుఅగ్నియైన క్రీస్తు హెబ్రి 12 : 29, అనుగంధచూర్ణములనగా పరిశుద్ధ జీవితముకలిగిన విశ్వాసి. (ఎఫె 5 : 2) సన్నిధి, క్రీస్తు, విశ్వాసిఏకమైయున్న స్థలమునుండి బయలుదేరునదే ప్రార్థన ధూపము ఈ ప్రార్థనాధూపము పరమండలమునకు ప్రయాణము చేయుట ప్రాణప్రియుడైన యేసువారుచూచి ధూమస్తంభమువలెవచ్చు నిది

"భౌతిక ఘాతలేకాదు, నైతిక ఘాతలును, గలవు. అట్టి [illegible] వ్యాధినుండి బాగు పడినవాడు నాకంటికింకను, కనుపించలేదు" [illegible]

యేమి? సకలమైన సుగంధధూపద్రవ్యములతో పరిమళించుచువచ్చు నిదిఏమని తిలకించుచూ, అఘ్రాణించుచు, ఆనందించుచున్నారు. పరమ 3 : 6. నీప్రార్థన పరిమళమువలె క్రీస్తు అఘ్రాణించునట్లు సన్నిధిలో సిద్ధపరచుచున్నావా? నోవాహుయిదే విధముగా ధూపమువేయగా ఆ పరిమళసువాసన ప్రభువు అంగీకరించి వాగ్దానము దయచేసెను ఆది 8 : 21. "దావీదు, నా ప్రార్థన ధూపమువలె సాయంకాల నైవేద్యమువలెను. నీదృష్టికి అంగీకారములగును గాక! అనినుడివెను. దా. కీ 141 : 2. ఈలాగు పరిశుద్ధులైన ప్రతివారి ప్రార్థనలు పరలోకమందున్న సువర్ణబలిపీఠముపై పరిశుద్ధులందరి ప్రార్థనలు సువర్ణపాత్రలతో కలుపుటకై అతనికి బహుధూపద్రవ్యములు యివ్వబడెను. అప్పుడా ధూపద్రవ్యములపొగ పరిశుద్ధుల ప్రార్థనలతో కలిసిదూతచేతిలో నుండి దేవుని సన్నిధికిచేరెను. ప్రక 8 : 3-5. 5 : 8. గనుక చదువరీ! నీవు క్రీస్తుసన్నిధిలో ఆరిపోయిన సిద్దెవలెకనబడనేల? మాదివిటీలు ఆరిపోవు చున్నవని అనుటయేల? మత్త 25 : 8. పార్థనయందున్న ప్రేమచల్లారనేల? అందుకు అక్రమము విస్తరించుట యేకారణముగదా మత్త 24 : 14. ఓయీ నిద్రబోతా! నీకేమివచ్చినది లేచి నీవుచావకుండునట్లు ఇప్పుడైన నీ జీవిత మును చక్కపరచుకొని నీ దేవుని ప్రార్థించుము యోనా : 5, 6. మీరు శోధనలలో ప్రవేశింపకుండునట్లు మెలకువగానుండి ప్రార్థనచేయుడని ప్రభువు శిష్యులను ( మత్త 26 : 38-41 ) హెచ్చరించినను ప్రార్థనలేమిచే వారుశోధనలలో పడిపోయిరి. కాబట్టిజరుగబోవు (శోధనలను) వీటినెల్లను తప్పించుకొని క్రీస్తుయెదుట నిలువబడుటకు శక్తిగలవారమగునట్లు ఎల్లప్పు డును ప్రార్థనచేయుచు మెలకువగాయుండుడి. లూక 21 : 36. మార్కు 13 : 33. ప్రభువుసన్నిధిలోనుండగా నీకన్నులకు నిద్రయైనను నీ కనురెప్ప లకు కునుకుపాటైనను రానియ్యకుము సామె 6 : 4. నిద్రించువాడు ఎట్టి ఆత్మీయమేలునుపొందక, ఉన్నవాటిని కోల్పోవును. గాన ప్రార్థనయందు నిలకడగాయుండి కృతజ్ఞతగలవారై దానియందు మెళుకువగాయుండుడి. కొల 4 : 2. అ. కా 1 : 14; 2 : 41; 6 : 4. "ఆశక్తి విషయములో మందులుకాక, ఆత్మయందు తీవ్రతగలవారై ప్రభువును సేవించుడి. నిరీక్షణ గలవారై సంతోషించుచు శ్రమయందు ఓర్పుగలవారై ప్రార్థనయందు పట్టు దలగలిగియుండుడి. రోమా 12 : 11, 12. ఒకవ్యక్తి ప్రతిదినము ఏకాంత స్థలమునకు ప్రార్థనకై పోవుచుండువాడు. కొంతకాలమునకు ప్రార్థించుటలో వెనుకబడి ఆమార్గమును ఆ స్థలమును పరిశీలించగా అదిఅంతయు అనేకపనికి

---

"దేవుని ప్రేమ శాశ్వతమైనది. ఆయన ధర్మములు పూరాతనవి. ఆయన కేవలము నమ్మదగినవాడు గనుక మన మాయనయందు విశ్వాస ముంచుటవలననే మన జన్మసార్థకమగును. ఏ. యెస్. పెట్టిజాన్,

మాలిన ముండ్లమొక్కలతో నిండియుండెను. సామె 24 : 30-31. అతడు తనహృదయస్థితియు అట్లేయుండెనని గుర్తెరిగి తనదుస్థితిని తలంచుకొనుచు దుఃఖించి ప్రార్థించుట మొదలుపెట్టెను. అప్పుడు శాంతిసమాధానములు తిరిగి తన హృదయములో నుద్భవించగా గొప్పజయముపొందెను. అలాగే ప్రార్థనలేని హృదయము బీడువలెమారును. అందుకోపము, ద్వేషము, దూషణ, అబద్ధము, గర్వము అవిధేయత, ప్రేమలేనితనము, ధనకాంక్ష స్వప్రయోజనము, స్వనీతి, దురాశ, శరీరాశ, నేత్రాశ, జీవపుడంబము మొదలగు ముండ్లమొక్కలు మొలచి జీవితమును అంధకారబంధురముగాను, దుష్టశక్తులకు నిలయముగాను సాతానుకు ఆశ్రయపట్టణముగాను, మారిపోవును. ప్రార్థనలేమి భయంకరపాపము. గాన, ప్రియుడా ప్రార్థించుటలో వెనుకబడక, విసుకక, ఎడ తెగక, ఓపికతో సన్నిధిగడియందుగడుపుము. దైవవాక్యము ప్రార్థనాంశ ములను అందించి వానిని నీ జీవితమునందు అనుభవించునట్లుగా ప్రార్థించుటకు ప్రోత్సాహపరచును. కొన్ని ప్రార్థనలకు జవాబులు వెంటనే వచ్చుచుగాని కొన్నిటికి రావు అందునుబట్టి నిరుత్సాహము, నిరాశ, విసుగుదలచెందక దేవుడు తగినసమయములందు మిమ్మును హెచ్చించునట్లు ఆయన బలిష్టమైన చేతి క్రిందదీనమనస్కులైయుండుడి. I పేతు 5 : 6. విసుగుదలచెందినచో ప్రార్థన నెరవేర్పు వెనుకకుపోవునుగాన దేవుని వాగ్దానములు తలంచుచు స్తుతించుము. ప్రార్థించుటయు, విశ్వసించుటయు విడువరాదు. వినుట విశ్వ సించుట. విధేయులగుట అను ఈ మూడులక్షణములుగలవారే పరలోక వారసు వ్యులు. విశ్వాసమే విజయము. 1 యోహా 5 : 4. సమయోచితముగా దేవుడు ప్రార్థన నెరవేర్చును. ఆయనమిమ్మునుగూర్చి చింతించుచున్నాడు. గనుక మీ చింతయావత్తును ఆయనమీదవేయుడి. I పేతు 5 : 7. కీర్త 55 : 22; 37 : 5; 46 : 5; సామె 16 : 2. బహుగా ప్రార్థనచేసి, బలమునుసంపాదించి, మహిలోకీడును గెల్చి దేవునిని మహిమపరచుము అప్పుడు ప్రార్థన పరమండల మందున్న దేవునిహస్తమును కదిలించును దేవునిహస్తము భూమండల మంతయు కదిలించును. గాన యిట్టిశక్తిగల దైవసన్నిధియందు వినమ్రుడవై విసుకక నిత్యముగోజాడి ప్రార్థించుము ప్రార్థనలేనిఆత్మకు బోధక్షేమమును కలుగచేయదు. ప్రార్థనలేని హృదయమునకు రక్షణకలుగదు. దేని గూర్చియు చింతపడకుడిగాని ప్రతివిషయములోను ప్రార్థన విజ్ఞాపనలచేత కృత జ్ఞతా పూర్వకముగా మీ విన్నపములు దేవునికి తెలియజేయుడి. అప్పుడు సమస్తజ్ఞానమునకుమించిన దేవుని సమాధానము యేసుక్రీస్తువలన మీహృదయ ములకును మీతలంపులకు కావలియుండును. ఫిలి 4 : 7; ఎఫె 6 : 18.

---

"కాలము విలువ నిర్ణయింప బడజాలని ప్రశస్తమైన ధనము. దానిని క్రీస్తుకొరకు యోగ్యమైన రీతిగా వాడుకొనుము" విలియమ్ మోవాట్

"నాగుడిసెలో ఒంటరిగానుండి ఎక్కువసమయము ప్రార్థనలో గడుపుటను నేను ఎక్కువగా ప్రేమించుచున్నాను"—బ్రెయినార్డు

"పగటిలో నాకుసమయము దొరికినప్పుడెల్ల ప్రార్థించకపోతే నేనుప్రార్థనాత్మను పోగొట్టు కొందును"—ఆండ్రో బోనార్డు.

# పాపయుక్తములైన ప్రార్థనలు ప్రభువినడు

## యోహా 9 : 31

1. ఆయన చిత్తానుసారముగా అడుగుమనవులు ఆయన ఆలకించునుగాని (I యోహా 5 : 14) చిత్తవిరుద్ధమైన మనవులు ఆలకింపడు.
2. మీరడిగినను మీభోగములనిమిత్తము వినియోగించుటకై దురుద్దేశముతో అడుగుదురుగనుక మీకేమియు దొరకుటలేదు. యాకో 4 : 3.
3. ధర్మశాస్త్రమును వినకుండ చెవినితొలిగించుకొనువాని ప్రార్థనహేయము. సామె 28 : 9.
4. దోషపూరిత హృదయము పాపయుక్తమైన చేతులుగలవారు మొర్రపెట్టినను, ఆయనవినక తనముఖమును కప్పుకొనును యెష 1:15 - 17.
5. భక్తిహీనునికి ఆధారమేది ? వానికి బాధకలుగునప్పుడు దేవుడువాని మొర్రవినునా ? యోబు 27 : 8, 9.
6. కాగావారు దుష్టులైన మనుష్యులగర్వమునుబట్టి మొర్రపెట్టుదురుగాని ఆయన ప్రత్యుత్తరమిచ్చుటలేదు. యోబు 35 : 12,
7. పరిశుద్ధులకు శత్రువులై ద్వేషించువారి ప్రార్థనకు యెహోవా జవాబు దయచేయడు. కీర్త 18 : 41.
8. హృదయములో పాపమును లక్ష్యముచేయువారి ప్రార్థన ఆయనవినడు. దా. కీ 66 : 18; యెష 59 : 1-3.
9. వారుదుర్మార్గతను అనుసరించి నడుచుకొనియున్నారు గనుక వారు యెహోవాకు మొర్రపెట్టినను ఆయనవారినునవి అంగీకరింపడు. మీకా 3 : 4.
10. నేను పిలిచినప్పుడు వారు ఆలకింపకపోయిరి గనుకవారు పిలుచునప్పుడు ఆలకింపను జఖ 7 : 13. యిర్మి 11 ; 10. సామె 1 : 24-28.
11. వారుతమకీడునుబట్టి నాకు మొర్రపెట్టినను నేనువినను. యిర్మి 11 : 14.
12. హేయకృత్యములు జరిగించుచు దేశమును బలత్కారముతో నింపుచున్న వారు నాచెవులలో వారెంత బిగ్గరగా మొర్రపెట్టినను నేనుఆలకింప

---

" నన్ను బలపరచుచున్న క్రీస్తుద్వారా శోధల నెదిరింపగలను, సహింపగలను, క్షమింపగలను, కరుణింపగలను, సహనముతో కని పెట్టగలను "

కుందును యెహెజ్కేలు 8 : 17, 18. అట్టివారి ప్రార్థన పాపమగును గాక కీర్త 109 : 7. పాపముద్వారా కృపదూరపర్చ బడుచున్నదిగాన పాపమును ఒప్పుకొని విసర్జించి ప్రార్థించుము "ప్రార్థనలు చేసినట్లు నటించి, జవాబులు పొందనటువంటి అనేకమంది క్రైస్తవులను నేనెరుగుదును" డి. యల్. మూడి. "ప్రార్థనలేని క్రైస్తవులు శక్తి లేని క్రైస్తవులు, నిద్రమత్తుగల మనస్సాక్షియు, సోమరితనముగల ఆత్మయు, చురుకుతనములేని హృదయమును, ప్రార్థనాజీవితములేని ప్రాణములు సైతానునివసించుటకు కోరుస్థానములు" ప్రార్థన, వాక్యము క్రైస్తవులకు రెండు రెక్కలైయున్నవి" సాధుసుందరసింగ్.

# ఇతరుల కొరకు ప్రార్థింపక పోవుటయు పాపము

నామట్టుకు నేను మరియెక్కువ ఆసక్తితో మీనిమిత్తము ప్రార్థనచేసెదను. ఆయన శ్రేష్టమైన చక్కనిమార్గమును మీకు బోధించెదను. లేనియెడల నేను యెహోవా దృష్టికి పాపినగుదును. 1 సమూ 12 : 23, రోమా 1 : 9, కొల 1 : 9. 1థెస్స 3 : 10, 2తి మొ 1: 3. విశ్వాసమూలముకానిదేదో అది పాపము రోమా 14 : 23; సకల దుర్నీతియు పాపము 1 యోహా 5 : 17. క్రీస్తును రక్షకునిగా అంగీకరింపకపోవుటయు ప్రేమించకపోవుటయు పాపమును శాపమునైయున్నది యోహా 8 : 24; 1 కొరి 16 : 22; కాబట్టి మేలైనది చేయనెరిగియుండియు, ఆలాగుచేయనివానికి పాపముకలుగును. యాకో 4 : 17,లూక 12 : 47. యోహా 9:41. గాన సువార్తను అందించకపోవుటయు, వారికొరకు ప్రార్థించకపోవుటయు, అపరాధమైయున్నది. యెహె 33:8-11. 3 : 11. గాన నీవంతు నీవుచెల్లించి దేవునిమహిమ పరచుము కొల 1 : 24. "భగవంతుడు జీవితాన్నే గాక. జీవితానికొక పరమార్థాన్నికూడ యిచ్చాడు"

\- ఫాదర్ ఫ్లానగన్.

# క్షమభావములేని ప్రార్థనలు విననేరడు

"జనులు నీయందు భయభక్తులుని లుపునట్లు నీయొద్ద క్షమాపణ దొరుకును కీర్త : 130 : 4; యెష 55 : 7.

క్షమభావములే నిఎడల హృదయము పవిత్రముగా నుండనేరదు. అందుచే తను దేవునిఎదుట నీప్రార్థన నిషిద్ధమై నదిగా ఎంచబడకుండునట్లు మీకుఒకనిమీద విరోధమేమైనను కలిగియున్న పక్షమందు మీరు నిలువబడి

---

'ఇతరు లతప్పులు పట్టుకొను ప్రయత్నించినంత కాలము నాహృదయము అంతకంతకు చెడిపోవుచున్నది ' డి. యెల్. మూడి.

ప్రార్థనచేయునప్పు డెల్లవాని క్షమించుడి. మార్కు 11 : 25, ఒకనియెడల ఒకడుదయగలిగి, కరుణాహృదయులై క్రీస్తునందు దేవుఁడుమిమ్ము క్షమించిన ప్రకారము మీరును ఒకరినొకరు క్షమించుడి. ఎపె 4 : 32, 1 యోహా 4 : 20. క్షమస్వభావము దైవలక్షణము. క్రీస్తు తన్నుచంపువారిని క్షమించుమని ప్రార్థించెను. లూకా 23 : 34. స్తెఫను తన్నురాళ్లతో మోదిచంపుచున్న వారికై ప్రభువా వారిమీద ఈ పాపమును మోపకుమని క్షమభావముతో ప్రార్థించెను. అపో 7 : 59 – 60. యోసేపు తనసహోదరులను క్షమించెను క్షేమించెను.

మరియు మనము మనసహోదరుల విషయములో అట్లుచేయగలుగుచున్నామా ? లేకపగసాధించుచున్నామా ! అలాగైన దైవసన్నిధిని నీ ప్రార్థనఎట్లు అంగీకృతముకాగలదు. కావున నీవుబలిపీఠము నొద్దఅర్పణ అర్పించుచుండగా నీమీద నీసహోదరునికి విరోధమేమైననుకలదని అక్కడ నీకు జ్ఞాపకమునకు వచ్చినయెడల బలిపీఠముఎదుటనే నీఅర్పణను విడిచిపెట్టి మొదటవెళ్లి నీ సహోదరునితో సమాధానపడుము త్రోవలో జ్ఞాపకమువస్తే త్రోవలోనుండగానే సమాధానపడుము అటుతరువాత నీ అర్పణలు నీప్రార్థనలు అర్పించుము. మనప్రార్థనలు, అర్పణలకంటే హృదయమునందు సమాధాన, ముండవలెను. దేవుడు సమాధాన కర్త. సమాధానపురాజుగాన సమాధానమునువెదకి వెంటాడుము గనుక మనుష్యుల అపరాధములను మీరుక్షమించిన ఎడల మీపరలోకపు తండియు మీఅపరాధములను క్షమించును. మత్త 6 : 14. మనప్రభువు నీవిస్తారపాపములను క్షమించియుండగా నీ సహోదరుని కొద్ది తప్పిదములను నీవుక్షమించలేవా ? మత్త 18 : 21 – 35. క్షమాపణ లేనిప్రార్థనలు పాపయుక్తములైనవి. సువాసనలేని సుగంధమువంటివి. లూకా 17 : 4; కొల 3 : 13; 2 కొరి 2 : 7; మత్త 5 : 44. కీడువలన జయింపబడక మేలు చేతకీడును జయించుము రోమా 12 : 17–21. లూకా 6 : 27. కావున నీవుదేవుని మందిరమునకు పోవునపుడు నీప్రవర్తన జాగ్రత్తగాచూచుకొనుము. ప్రస 5 : 1–3. ఆయాసకరమైనమార్గము నీయందున్నదేమో చూచుకొనుము. దా. కీ 139 : 24. అధికులైనను అల్పులైనను, బలీనులైనను బలీనులైనను క్షమాపణా మనసుకలిగియుండుట శ్రేష్టము. గొప్పవారు తక్కువ వారిని క్షమాపణకోరుటకు వెరతురు, మరతురు. క్షమాభావముకలిగినఎడల సంతుష్టికరమైన శాంతి, సమ్మతిగలమనస్సుకలిగి పరిశుద్ధాలంకారములతో ప్రభువును సేవింతురు. 1 యోహా 3 : 20, 21. మనహృదయము మనఎదుట

"న్యాయముగా నడుచుకొనుటయు, కనికరము చూపగోరుటయు, దీనమనస్సుగలిగి దేవునియెదట ప్రవర్తించుటయు, ఇంతేగదా యెహోవా నిన్ను అడుగుచున్నాడు" మీకా 6 : 8;

దోషారోపణ చేయనియెడల దేవునిఎదుట ధైర్యముగలవారమగుదుము. ప్రియ చదువరీ! నీపాపములు ప్రభువునొద్దనొప్పుకొని క్షమాపణకోరుటయే గాక నీవు వ్యక్తిగతముగా చేసిన దోషములు వ్యక్తులయొద్దను, సంఘసంభంధమైనవి, సంఘములోను ఒప్పుకొని క్షమాపణపొందవలెను. అట్టిజీవితము ధన్యమైనది. "ఎవ్వరిపట్ల ద్వేషములేకుండ అందరిఎడల ఔదార్యముతో భగవంతుడిచ్చిన సత్యదృష్టితో, సత్యంపట్ల స్థిరచిత్తంగలిగి మనంపూనుకొన్న పనిని ముగించడానికి పాటుపడదాం" అబ్రహాంలింకన్ - అధికారవ్యామోహితుడు ప్రార్థించుటలో బలహీనుడగును. క్షమాభావములేని ప్రార్థనలు జీవములేని చలన చిత్రములవంటివి.

## వేకువనేలేచి ప్రార్థించుము

"నేను వేకువకుముందుగా లేచెదను" దా. కీ 57 : 8; 108 : 2.

1. తెల్లవారుఝామున అబ్రహాములేచి దేవునిసన్నిధినినిలిచెను. ఆది 19 : 27.
2. వేకువనేలేచి యాకోబు దేవుని ఆరాధించెను. ఆది 28 : 18. 35:13-15.
3. మోషే దేవుని బలిపీఠమునుకట్టుటకు ఉదయమందు పెందలకడలేచెను. నిర్గ 24 : 4.
4. మోషే అరుణోదయమునకు ముందేలేచి సీనాయికెక్కి దేవునిసన్నిధిని నిలిచియుండెను. నిర్గ 34 : 2; 4.
5. దావీదు ఉదయముననే ప్రార్థనదేవునిసన్నిధిని సిద్ధముచేసెను. దా. కీ5:3.
6. అన్నాయు, ఎల్కానాయు దేవుని ఆరాధించుటకు వేకువనేలేచిరి. 1 సమూ 1 : 19.
7. యోబు అరుణోదయముననేలేచి తనబిడ్డలనిమిత్తము దహనబలి సమర్పించెను. యోబు 1 : 5.
8. క్రీస్తు చాలరాత్రియుండగా అరణ్యమునకేగి ప్రార్థనచేయుచుండెను. మార్కు 1 : 35. గాన ప్రాతఃకాలమున బలులుతెచ్చి అర్పించుడి. ఆమో 4 : 4.

## ప్రార్థన సమయములు

1. ఉదయమున దావీదు ప్రార్థించెను, దా. కీ 88 : 13; 55 : 7.
2. పేతురు పండ్రెండుగంటలకు ప్రార్థించుటకు మిద్దెనెక్కెను. అపొ 10:9.
3. కొర్నేలి మూడుగంటల సమయమున ప్రార్థించెను. అపొ 10 : 3; 3 : 1.

---

"కాగా నాప్రియ సహోదరులారా! మీ ప్రయాసము ప్రభువునందు వ్యర్థముకాదని యెరిగి, స్థిరులును, కదలనివారును, ప్రభుకార్యాభివృద్ధియందు ఎప్పటికిని ఆసక్తులైయుండుడి"-1 కొరి 15 : 58

4. ఇస్సాకు సాయంకాలమున ధ్యానింపవెళ్లెను. ఆది 24 : 63.
5. సంఘము పేతురుకొరకు రాత్రివేళను ప్రార్థించెను. అపొ. 12 : 12.
6. పౌలు, సీల, మధ్యరాత్రిలో ప్రార్థించిరి. అపొ 16 : 25.
7. క్రీస్తు రాత్రియంతయు ప్రార్థించెను. లూక 6 : 12; 9 : 18, 28; 5:16, మత్త 14 : 23.
8. నెహెమ్యాదివారాత్రులు ప్రార్థించెను. నెహె 1 : 6. యిర్మి 9 : 1; 14 : 17.

"సాయంకాలమున ఉదయమున మధ్యాహ్నమున నేనునిన్ను ధ్యానించుచు మొర్రపెట్టుకొందును" దా. కీ 55 : 7; 119 : 55; 88 : 1. నీ ప్రార్థనాసమయములు రాత్రియైనను పగలైననుకావచ్చును, నీఅనుకూలతను బట్టి నీయందలి విశేషాశక్తికొలది ప్రార్థించుటకు కొన్నిసమయములు ఏర్పరచుకొనుటమంచిది. మంచముదిగగానే మొదట మోకాళ్ళని తండ్రిని తలంచుచు ప్రార్థించుము. అదిమంచిపనులన్నిటికంటె మించినపనియగును. కొంచెమైనను బద్ధకించుట సరిగాదు. నీ దినములన్నియు ఉదయకాలధ్యానముతో ఆరంభమై రాత్రికాలధ్యానముతో పరిపూర్ణముకావలెను. "ప్రతి ఉదయం నేను రెండు గంటలు ప్రార్థించనిఎడల ఆదినము సైతానుకు జయముకలుగును నాకుచాల పనులుండుటవలన ప్రతిదినము మూడుగంటలుప్రార్థన చేయకుండ వుండలేను, నా హృదయము దేవునివైపుకు ఎత్తకుండ నాస్థలమునుండి లేవను జాన్‌ఫ్లెచ్చర్ "లూథరు ప్రతిదినము మూడుగంటలు ప్రార్థనయందు గడిపెను" గాన "అధికమైన పరిశుద్ధతను అనుభవించుటకును, క్రీస్తు సారూప్యములోనికి పెరుగుటకును, ఆతురతతో నేను పరుగెత్తెదను"

—యోనాతాను ఎడ్వర్డ్స

## మోకాళ్లని ప్రార్థించుము

**"రండి! నమస్కారముచేసి సాగిలపడుదము మనలను సృజించిన యెహోవా సన్నిధిని మోకరించుదము" దా. కీ 95:7.**

ప్రార్థించుటలో మోకాళ్లజీవితము చాలాప్రాముఖ్యమైనది. క్రీస్తుకూడాసమస్తముపైజయముపొందునట్లు మహారోదనముతో కన్నీళ్లతోను, చెమటరక్తముగా మారునంతమట్టుకు మోకాళ్లపైనిలిచి ప్రార్థించెను. లూక 22 : 41 - 44. ప్రియుడా! నీవుమాదిరిగానున్న ప్రార్థనానియమము పాటించుచుంటివా? లేక నీవిషయమై దేవుడు హృదయపూర్వకముగానన్ను బ్రతిమాలుకొనక

---

"నా కర్తయగు దేవుని యెదుట నన్ను నేను తగ్గించుకొనుట నాకు ఘనతయు బలముపైయున్నవి" –II A, సాపిర్.

తమ శయ్యలమీదపరుండి కేకలువేయుచున్నారని నేరమారోపించుచున్నా డేమో ఆమో 6 : 4. హోషే 7 : 14; నీరక్షణ కర్తయేమోకరించి ప్రార్థించగా నీవుపరుండి ప్రార్థించుట ఎంత అవిధేయత. నేను పరుండియుండి నా ప్రాణప్రియుని వెదకితిని, పరమ 3 : 1 - 3. రాత్రివేళ అనగా అంధకార జీవితము అనగా పాపపుబ్రతుకు, పరుండియుండి అనగా సోమరి జీవితము. ఈరెండు జీవితములు కలిగి ఎంతవెదకినను క్రీస్తు-వారికి దొరకడు. పట్టణము వెంబడిపోయివెదకెను. అనగా డాంబిక జీవితము, సంతవీధులలో వెదకెను. అనగా దగా,మోసముతో కూడిన బ్రతుకునందుండివెదకినను ఆయన దొరకలేదు. వాటినన్నిటినివిడిచి వెదకినందున ప్రాణప్రియుడు దొరికెను. గనుక చదువరీ పాలుమాలికను, పారద్రోలివేచి మోకాళ్లూని ప్రార్థించుము. సొలొమోనురాజు ప్రజలయందు దేవుని సముఖమున మోకాళ్లూని ప్రార్థించెను. 2 దిన 6 : 13; 1 రాజు 8 : 54. ఎజ్రాతనజనులపాపము నిమిత్తము మోకాళ్లూని ప్రార్థించెను. ఎజ్రా 9 : 5. దానియేలు దాస్యవిముక్తినొంది యెరుషలేము పునరుద్ధరణకై అనుదినము ముమ్మారు మోకాళ్లూని తనదేవునికి ప్రార్థించుచుండెను. దాని 6 : 10. అబ్రహాము దాసుడైన ఎలియేజరు ఒంటెలను సయితము మోకరింపజేసి యిస్సాకునకు తగువధువునిమ్మని ప్రార్థించెను. ఆది 24 : 11. స్తెఫను తనమరణసమయమందు మోకాళ్లపై ప్రార్థించుచు తన ఆత్మను ప్రభువుకు అప్పగించెను. కార్య 7 : 60. దోర్కాయను చిన్నది మరణించియుండ పేతురు మోకాళ్లపై ప్రార్థించి పునర్జీవితురాలుగాచేసెను. కార్య 9 : 40. కుష్టరోగిశుద్ధికొరకు క్రీస్తుఎదుట మోకాళ్లూని ప్రార్థించెను. మార్కు 1 : 40; 10 : 17. పౌలుకు వీడ్కోలు యిచ్చుసమయమున వారందరు సముద్రతీరమున మోకరించి ప్రార్థించిరి. అపొ 20 : 36; 21 : 5. సంఘసంక్షేమముకొరకుపౌలు మోకాళ్లపై ప్రార్థించెను. ఎఫె 3 : 14 ఎపఫ్రా ఎల్లప్పుడు సంఘసంపూర్ణతకొరకై ప్రార్థనలో పోరాడువాడు. కొల 4 : 12. మోషే నెబోశిఖరముపైనిలిచి ఆకాశముపైపు తనచేతులెత్తి ప్రార్థించగా శత్రువులపై సంపూర్ణజయమొందెను. నిర్గ 17 : 8-16. అల్పైదైవసైనికులు మోకాళ్లపై ప్రార్థించి పైనుండి శక్తిపొందినయెడల పాతాళశక్తులు నిలువనేరవు. మత్త 16 : 18. మీరు భూమిమీద వేటిని బంధింతురో! వేటిని విప్పుదురో! అవి పరలోకమందును జరుగును. మత్త 18 : 18-19; రోమా 16 : 20. గాన ప్రతివాని మోకాలు యేసునామమున వంగవలెను. ఫిలి 2:10. రోమా 14 : 11. యెషె 45 : 23; అందునుబట్టి వడలినచేతులను సడలిన మోకాళ్లనుచాపుడి హెబ్రి 12 : 12. యెష 35 : 3. యోబు 4 : 3; 4.

---

" మనము ఈ బ్రతుకున నెట్టి ఉన్నత స్థితి యందున్నను మోకాళ్ళ మీదఉంటేనే తప్ప నిలువజాలము " ఎలిజిబెత్ ఉర్చ్.

బిషప్ ఆ(డ్రూస్ (ప్రతిదినము (ప్రార్థనాధ్యానములో 5 గంటలు గడిపెను. "పాపమునకుతప్ప మరిదేనికి భయపడనివారిని, దే వు ని ని, తప్పమరిదేనిని ఆశింపనివారిని నూరుమంది బోధకులను నాకిమ్ము. వారు పాదిరీలైనను లేక సంఘస్తులైనను నాకు కొంచెమైనను లక్ష్యములేదు. అలాంటివారు మాత్రమే నరకద్వారములనుకదిలించి పరలోకరాజ్యమును భూలోకములో స్థాపించ గలరు. (ప్రార్థనకు (ప్రత్యుత్తరముతప్ప దేవుడు ఏమియుచేయడు" జాన్ వెస్లీ.

# ఉ ప వా స (ప్రా ర్థ న

**"ఉపవాసదినము (ప్రతిష్టించుడి, (వ్రతదినము ఏర్పాటుచేయుడి"**
యోవేలు 1 : 14.

ఉపమి = అనగా సమీపము. వాసము = నివసించుట. ఉపవాస మనగా దేవునిదగ్గర నివసించుట, సన్నిధియనగా, సామీప్యము, సాని ధ్యము. సహవాసము, ఉపవాసము, నివాసము, పరమున (క్రీస్తుతో నివాస ముండువరకు భువియందు ఉపవాసముండవలసినదే. ఈఉపవాసమే మనలను ఎడతెగని సహవాస, నివాసమునకు గొంపోవును. ఉపవాసము మానసిక మలినమునుబాపి . దైవశక్తితో నింపును. శరీరశక్తులన్నియుఉడిగి ఆత్మీయ శక్తులు జీవింపఁబడి తేజరిల్లును. మనస్సును వికసింపజేసి బలపరచును. దైవాత్మ నింపుదల, దైవ(ప్రత్యక్షత, దైవికస్వస్థత, ఆత్మకృపావరములు, కార్యసాఫల్యత అనునవి ఉపవాస(ప్రార్థనవలననే బడయగలము. ఇదిఒక పవి(త(వ్రతమువంటిది. దివ్యౌషధమువంటిది. దీనివలన శారీరక, మానసిక రుగ్మతలనుండి విడుదలకలిగించి దైవ(ప్రభావముతోకూడిన కేబినట్ గా మార్చును. మోషే రెండుపర్యాయములు నలుబదిదినములు ఉపవసించి దైవ మహిమా(ప్రసన్నతనొందెను. నిర్గ 24 : 18; 34 : 28; ద్వితి 9 : 9; 18. ఏలియా నలుబది దివారాత్రులు ఉపవాసముతో దైవశక్తిచే శక్తికిమించిన (ప్రయా ణముచేసి హోరేబు ( దేవుని పర్వతము ) నందుగల గుహ (సన్నిధి) లోని వసించి దైవ(ప్రత్యక్షతనుపొందెను. 1 రాజు 19 : 8. (క్రీస్తుకూడ 40 దినములు ఉపవాసముండి సాతానుశోధనలన్నియు సంపూర్ణముగా జయించెను. మత్త 4 : 7 - 11; గాన మనుష్యుడు ఆహారపానీయముల వలననేగాక దేవునినోట నుండివచ్చు (ప్రతిమాటవలన జీవించును. ద్వితి 8 : 3.

దానియేలు (ప్రజలదాస్య విమోచనార్థమై ఎరుషలేము పునరుద్ధరణ కొరకును. మూడువారములు ( 21 దినములు ) ఉపవాసముండి మనోక్లేశ ముతో విలాపముసలిపెను. దాని 10 : 2-4. ఈ దేవుని (ప్రియుడైన దాని

"శరీరముతోపాటు, మనస్సుకుకూడా, ఉపవాసములేనియెడల అట్టి ఉపవాసమునకు ఫలితము అహంకారమే" మహాత్మాగాంధీ

యేలుచేసినట్లు ఉపవాసములో అతివినయ మనస్కుడవై ప్రార్థించగలవా? దాని. 9 అధ్యా-ననుసరించి ప్రార్థించుము. అట్టిప్రార్థన దేవునికి అతిమనోహరమైన సువాసననిచ్చు సజీవయాగముగానుండెను. నీఆత్మ, నీకుటుంబము, నీసంఘము చెడిపోయి పడిపోయి శిథిలమైపోయినందున, తిరిగిపునర్నిర్మాణముకై ప్రార్థించుము. ఎందుకు ఊరకుందువు అందునుబట్టి ఎజ్రాచెరపట్టబడిన తనప్రజలనిమిత్తమై దుఃఖించుచు భోజనమైనను పానమైనను చేయకుండెను. ఎజ్రా 10 : 1, 6. యిర్మీయానా జనులలో హతమైనవారినిగూర్చి నేనుదివారాత్రము కన్నీరువిడచునట్లు నాతల జలమయముగాను నాకన్ను కన్నీళ్ల ఊటగాను ఉండెనని పలికెను. యిర్మీ 9 : 1, 2. ఇశ్రాయేలీయులు బాబెలు దాస్యవిముక్తి నొందినవారై జెరుషలేమాభిముఖులై వారినిదుఃఖపరచుకొని, శుభప్రయాణము కలుగునట్లు అహవాఅను నదిదగ్గర ఉపవాసముండి మనవి చేయగా దేవుడు వారిమనవి నంగీకరించెను. ఎజ్రా 8 : 21-23. మోయాబీయులు అమ్మోనీయులను భ్రష్టసంతానశత్రుసైన్యము ఇశ్రాయేలీయులమీదికి దండెత్తి నాశనము సమకట్టియుండగా యెహోషాపాతు ఆయన ప్రజలను ఉపవాసముండి ప్రార్థించి విడుదలనొందిరి. 2 దిన 20 : 3. సమూయేలు ఇశ్రాయేలీయులును శత్రువులపై జయముకలుగునట్లు ఉపవాసముండి ప్రార్థించిరి. 1 సమూ 7 : 5 - 12. అహాబు ఉపవాసముండి వ్యాకులపడగా గొప్ప శిక్షతొలిగెను. రాజు 21 : 27 - 29. గనుక చదువరీ పాపభూయిష్టంబైన ఈ బబులోను చెరసాదృశ్యముగానున్న ఈ లోకమునందుండి త్వరలో విడుదలనొంది శుభప్రదమైన నిరీక్షణగలవారమై క్రీస్తు ద్వితీయాగమనము ద్వారా నూతనయెరుషాలేము చేరగలుగునట్లు ఉపవాస ప్రార్థనద్వారా నిన్నునీవు సిద్ధపరచుకొనుచున్నావా? ఎస్తేరుమొర్దెకైలు మూడుదినములు ఉపవాసముండి ప్రార్థించుటద్వారా మరణశాసనమునుండి ప్రజలనురక్షించెను. ఎస్తే 4 : 6. నెహె 9 అధ్యా, అలాగే నినెవే పట్టణవాస్తవ్యులందరు తమమీదికిరాబోవు భయంకర నాశనమునుండి తప్పించుకొను నిమిత్తము ఉపవాస ప్రార్థనచేయగా దేవుడా పట్టణమంతటిని రక్షించెను. యోనా 3 అధ్యా. గాన ఉపవాస ప్రార్థనద్వారా ఎట్టిఅసాధ్యమైన కార్యమైనను, సాధింపవచ్చును. పౌలుతన పాపపరిహారము నిమిత్తము మూడుదినములుపవాసముండి ప్రార్థించి రక్షింపబడెను. అపొ 9 : 9. పౌలు బర్నబాలు సంఘక్షేమార్థమై ఉపవాసముండి ప్రార్థించి అపొ 13 : 2; 3, 14 : 23. 2 కొరి 11 : 27. సాధు సుందరసింగుగారును 40 దినములుపవాసముచేసి అనేక ప్రత్యక్షతలు పొందగలిగిరి. యోహాను శిష్యులును పరిశయ్యులును ఉపవాసనియమము కలిగి

---

'నీకుగలఆరోగ్యముకొలది ఉపవాసప్రార్థనలో గడుపుము. సాధారణక్రైస్తవుని నీతికన్న నీనీతి అధికముగా నుండునట్లుల జీవించుము'—డేవిడ్ బ్రైనార్డు.

యుండిరి. మత్త 9 : 14. మార్కు 2 : 18. లేవి 23 : 27. యిప్పుడైనను ఉపవాసముండి మీ వస్త్రములను గాక మీ హృదయములను చింపుకొని కన్నీరు విడుచుచు దుఃఖించుచు మనఃపూర్వకముగా తిరిగి నాయొద్దకు రండని దేవుడు సెలవిచ్చుచున్నాడు. యోవే 1 : 12; 2 : 14, 15. నీ ఉపవాసము పరులకగపరచుకొను వేషధారణమైనదిగాయుండక మత్త 6 : 16, దేవుని కిష్టమైన యెష 58 అద్యా జఖ 7 అద్యా. లననుసరించిన ఉపవాసముగా నుండవలెను. జఖ 8 : 19. నీ వాలాగు చేసినయెడల వర్ణింప నలవిగాని మహిమాశీర్వాదములు నీపైవర్షింపగలవు. ఉపవాస ప్రార్థనయే అపవాది క్రియలను లయపర్చు ఏకైకదివ్యాస్త్రము. భయపెట్టవచ్చిన అపవాది భయపడి పారిపోవును. సమస్తవిషయములలో సంపూర్ణజయము పొందగలము. శిష్యులు ప్రభువును ఏకాంతమందు మేమెందుకా దయ్యమును వెళ్లగొట్టలేకపోతిమని అడుగగా అందుకాయన ఉపవాస ప్రార్థన వలననేగాని మరదేనివలనైనను ఈ విధమైనది వదలిపోవుట అసాధ్యమని వారితో చెప్పెను. మార్కు 9 : 28-29. కాబట్టి అసాధ్యమైనవి సాధ్యముచేయునది మిత్రమా దావీదు ఉపవాసముచేత నాప్రాణమునాయాస పరచుకొంటిననియు దా. కీ 51 : 17; 35 : 13. 2 సమూ 12 : 16-20. దానియేలు ఉపవాసముండి ప్రభువగు దేవునిఎదుట నామనస్సును నిబ్బరముచేసికొంటిననియు (దాని 9 : 3-6) సాక్షమిచ్చుచుండగా అట్టిశ్రేష్టమగు నుపవాసము నుపసంహరించుటేల? సీయోనుకుమారి నదీప్రవాహమువలె దివారాత్రము కన్నీరు పారనిమ్ము. విరామము కలుగనియ్యకుము. నీకంటిపాపను విశ్రమింపనియ్యకుము. నీవులేచి రేయి మొదటిజామున మొర్రపెట్టుము, నీళ్లుకుమ్మరించునట్లు ప్రభువుసన్నిధిని నీ హృదయమును కుమ్మరించుము. విలా 2 : 18-19. మెథడిస్టు మిషనుస్థాపకుడగు, జాన్ వెస్లీ క్రమముగా ఉపవాసప్రార్థనానియమమును కలిగియుండి తన సంఘసభ్యులను ప్రతి బుధ, శుక్రవారములు ఉపవాసముండి ప్రార్థించుడని శాశించెను. అల్లేడేవిడ్ బ్రెయినార్డు అను మిషనెరి అరణ్యమునకేగి ఉపవాసముండి మంచులో మోకాళ్లూని ప్రార్థించుచు దేహమువిడిచి సన్నిధినుండి నిత్యదైవసన్నిధికరిగెను. యిదిఎంతధన్యతగాన దైవసన్నిధిని ఉపవాసముండి జవాబులుపొందుము. యెష 59 : 1, దా. కీ 31 : 19; కొరి 2 : 9. "మా ఉపవాస ప్రార్థనలద్వారా మా హృదయములు పరలోకమునకును, దైవమహిమకును చాల సమీపముగానుండెను"

— స్పర్జన్.

"దేవునిశక్తి నాబలహీనతలో పరిపూర్ణము కాబడెను" అందువలన నా దేవుని నేను కనుగొనేవరకు, అయనకు అన్నివిషయములలో విధేయుడనై 3 నెలలు ఉపవాసముండుటచే ఆత్మీయముగా బలపరచబడితిని. ఓరల్ రాబర్ట్సు.

# విజ్ఞాపన ప్రార్థన

## "యెహోవా జ్ఞాపకకర్తలారా విశ్రమింపకుడి...ఆయనను విశ్రమింపనియ్యకుడి" యెష 64 : 7.

విజ్ఞాపన అనగా జ్ఞాపకముచేయుట లేక మొర్రపెట్టుట:- దావీదు సంతతిమీదను. యెరుషలేము నివాసులమీదను కరుణనొందించు ఆత్మను "విజ్ఞాపనచేయు ఆత్మను" నేను కుమ్మరించెదను. జఖ 12 : 10. నీతిమంతుని విజ్ఞాపన మనఃపూర్వకమైనదై, బహుబలముగలదైయుండును. యాకో 5 : 16. (1) సొదొమకొరకు అబ్రహాముచేసిన విజ్ఞాపన ఆది 18 : 22, 23; 19 : 29. (2) మోషేఇశ్రాయేలీయులకొరకు విజ్ఞాపనచేసెను. నిర్గ 32:30-34. (3) రాజులకొరకు, ప్రజలకొరకు, భక్తుడగు సమూయేలు విజ్ఞాపనచేసెను. 1 సమూ 7:5-12; 12 : 16-26. (4) దావీదు, దహన, సమాధానబలినర్పించి, విజ్ఞాపనచేయగా తెగులు ఇశ్రాయేలీయులను విడచెను. 2 సమూ 24 : 25. (5) కర్మెలు పర్వతముపై ఏలీయా అగ్నికొరకును, వర్షము కొరకును చేసిన విజ్ఞాపన 1 రాజు 18 : 36-46. యాకో 5 : 17; 18. (6) చనిపోయిన బిడ్డలకొరకు ఏలీయా, ఎలీషాలుచేసిన విజ్ఞాపనలు. 1 రాజు 17 : 19 - 24, 2 రాజు 4 : 33. (7) తన్నుచుట్టు కొనియున్న శత్రుసైన్యములకు అంధత్వము కలుగునట్లు ఎలీషాప్రార్థించుట 2 రాజు 6 : 17, 18. (8) సొలొమోను జ్ఞానముకొరకు ప్రార్థించుట 2 రాజు 4 : 29. (9) గొడ్రాండ్రయిన శారా (ఆది 21 : 1-3.) (10) రిబ్కా (ఆది 25 : 21) (11) షూనేమీయురాలు, 2 రాజు 4 : 14. (12) ఎలీసబెతు, లూక 1 : 13; 37. (13) మనోహ, న్యాయా 13 : 9. (14) అన్నా 1 సమూ 1 : 15. వీరందరు సంతానముకై విజ్ఞాపనచేయగా దేవుడను గ్రహించెను. గర్భఫలము యెహోవా ఇచ్చు బహుమానమే దా. కీ 127 : 3, 113 : 9. (15) నశించుచున్న లోకముకొరకు యేసుప్రభువుచేసిన విజ్ఞాపన మత్త 26 : 36-47. హెబ్రి 5 : 7. (16) పౌలు సంఘముయొక్క క్షేమాభివృద్ధికొరకుచేసిన విజ్ఞాపన. కొల 1 : 9-12. (17) క్రీస్తు తండ్రి కుడిప్రక్కనకూర్చుండి విజ్ఞాపన చేయుచున్నాడు. హెబ్రి 7 : 24 - 27. రోమా 8 : 34. (18) పరిశుద్ధాత్మయు మనపక్షముగా విజ్ఞాపన చేయుచున్నాడు. రోమా 8 : 26.

**విజ్ఞాపనాంశములు:-** (1) రోగులకొరకు యాకో 5 : 14 (2) పాపములో నున్నవారి విడుదలకొరకు 1 యోహా 5 : 16 (3) శోధింపబడు ఆత్మలకొరకు లూకా 11 : 4 (4) బిడ్డలకొరకు విధవరాండ్రు, అనాథులకొరకు ఆది 17 : 18 మత్త 15 : 23 (5) రక్షణ యెరుగని అన్య జనాంగములకొరకు రోమా

---

" మనకు ఆశ్రయమును, క్షమాపణయును, సమస్తమును జయించు శక్తియును క్రీస్తుయొక్క సిలువద్వారా లభించును"-జేమ్సు, ఎచ్. ముమ్మె.

20 : 3 (6) దేశాధికారులకొరకు 1 తిమో 2 : 1–2 (7) నీ చుట్టునున్న విరోధులకొరకు, హింసించువారికొరకు మత్త 5 : 44 (8) కోతపనివారి కొరకు మత్త 9 : 37, 38 (9) విశ్వాసులు కృపలో భద్రపరచబడుటకొరకు యోహా 17 : 12 - 15 (10) పరిశుద్ధాత్మ కుమ్మరింపుకొరకు అ. కార్య 1 : 4, 2:14 (11) కుటుంబముకొరకు, స్నేహితులకొరకు యోబు 1:5, 42:8 (12) ప్రభువురాకడకొరకు ప్రక 22 : 20 (13) ప్రభువు రాజ్యస్థాపన కొరకు లూక 11 : 2, 3 నీపనులభారమును యెహోవా మీద నుంచుము అప్పుడు నీవుద్దేశములు సఫలమగును సామె 16 : 3 దా. కీ 37 : 5, 55:22 32 : 8 నీ ప్రవర్తన యంతటియందు ఆయన అధికారమునకు ఒప్పుకొనుము. అప్పుడాయన నీత్రోవలను సరాళముచేయును. సామె 3 : 6 యెష 26 : 8 "ఎడతెగక ప్రార్థించుడి, ఆత్మను ఆర్పకుడి" 1 థెస్స 5 : 16, 19 ఆయన నా విజ్ఞాపనల ధ్వనిని ఆలకించియున్నాడు దా. కీ 31 : 22, 66 : 19 "రహస్య ప్రార్థనసేవమీద వర్ణింపజాలని అసమానమైన ఆశీర్వాదములను తెచ్చుచున్నది!" "పరిశుద్ధాత్మాభిషేకము" మనము వహించుచున్న అభిషేకము సైన్యముల కధిపతియైన ప్రభువునుండి రానియెడల మనము మోసగాండ్లము ఎందుకనగా ప్రార్థనద్వారా దానిని పొందగలము యిప్పుడును ఎల్లప్పుడును తీవ్రమైన విజ్ఞాపన ఎడతెగక చేయుదము నీయొక్క ఉన్నత పరలోకపుమంచుతో తడపబడు పర్యంతము విజ్ఞాపనయను కళ్ళెము పైయుండనిమ్ము

— స్పర్జన్.

"తమదేవుని ఎరుగువారు బలముగలిగి గొప్పకార్యములు చేయుదురు" దా. కీ 11 : 32.

**ప్రార్థనాశక్తి:**— పేరిస్ నగరమున మానికమ్మను ఒక సౌందర్యవంతురాలు గలదు. ఆమె చాల పరిశుద్ధత, భక్తితో నిండిన ప్రార్థనాపరురాలు ఆమెకు ఎం. ఎ. పరకు చదివిన అగస్టీనను పుత్రుడు గలడు ఆమె సుందరవతి యగుటంజేసి యావనస్థులాయింటికి దురుద్దేశముతో పోవుచుండెడివారు. వారాపరిసరముల కరుదెంచినతోడనే పశ్చాత్తాపహృదయులై దుఃఖముతో పాపములొప్పుకొనుచు భక్తులైపోయెడివారు కొంతకాలమునకు అగస్టీను త్రాగుడు, జూదము, వ్యభిచారము మొదలగు దుర్వ్యసనములకు లోనై అధికముగా చెడిపోయెను.

తనయుని రక్షణకై కన్నీటిప్రార్థన చేయుచుండెను. అతనిజేబులో సారెసారెకు బైబులునుంచుచూ వచ్చెను. కాగా అతడు దానిని చదువక

"మహాసంస్కరణ కాలములో ప్రపంచమును కదిలించగలిగిన శక్తి రహస్య ప్రార్థనామందిరమునుండి వచ్చెను" - గ్రేట్ కాంట్రవర్సి పుట 210.

పోగా అయాస్థలములలో పారవేసెడివాడు. అన్నియు వ్యర్థముకాకుండుటకై తల్లి ప్రార్థించెడిది. అందుచే చదివినవారందరు భక్తులుగా మారిపోయిరి. ఒకదినము అగస్టీనుకు మనోవేదన అధికముకాగా ఏమియు నెమ్మదిలేనివాడై అరణ్యమునకేగి తిరుగుచుండగా ఆకాశంబునుండి నొక గంభీరస్వరము "అగస్టీన్ విప్పిచదువుము" అని ముమ్మారు వినబడెను. వెంటనే మోకరించి తనజేబునుండి బైబిలుతీసి చదివి పశ్చాత్తాప్తుడై దుఃఖించుచు దేవునిఎదుటను తల్లిఎదుటను తనపాపములొప్పుకొని రక్షించబడి మహాభక్తుడై బైబులుకు ప్రతిపదార్థము (concordence) వ్రాసెను. ఇదే మొదటిది. దీనినిచదివి లూథరు మతోద్ధారకుడాయెను. ఈ గంభీర విప్లవాత్మకమైన మార్పునకా మెప్రార్థనాశక్తియే కారణము అట్లే నీపిల్లల రక్షణకొరకు నీచేతులను ఆయనతట్టు ఎత్తుము విలా 2 : 18 అప్పుడు నీపిల్లలందరు యెహోవాచేత ఉపదేశము నొందుదురు. నీపిల్లలకు అధిక విశ్రాంతి కలుగును. యెష 54 :13 యదార్థముగా ప్రవర్తించు వారికి ఆయన ఏ మేలును చేయక మానడు దా. కీ. 84 : 11, 34 : 4, 10. ఊరకుండి నమ్మకొనుటవలన మీకు బలముకలుగును. యెష 30 : 15, "పనిఎక్కువగుచో, ప్రార్థన తక్కువగును. ప్రార్థన తక్కువగునేని, ఫలితము నిరర్థకమగును"

# దైవస్తుతి

## "అందరును యెహోవా నామమును స్తుతించుదురుగాక" దా. కీ 148 : 13.

మన దేవునికి స్తోత్రగానముచేయుట మంచిది. అదిమనోహరము స్తోత్రముచేయుట ఒప్పిదము దా. కీ 147 : 1; 135 : 3. నా ప్రాణము ప్రభువును ఘనపరచుచున్నది. నా ఆత్మ నారక్షకుడగు దేవునియందు ఆనందించెను. లూకా 1:46-48; గాన మనము అవసరములనుబట్టి ప్రార్థించుటయే గాక ఆయన గుణాతిశయములను తలంచుచుస్తుతింప బద్ధులమైయున్నాము.

1. దేవదూతలు చేసినస్తుతులు:- సర్వోన్నతమైన స్థలములలో దేవునికి మహిమయు, ఆయన కిష్టులైన మనుష్యులకు భూమిమీద సమాధానము కలుగునుగాక నియు లూక 2 : 14; భూతవర్తమాన భవిష్యత్కాలములలోనుండు సర్వాధికారియు, దేవుడునగు ప్రభువు పరిశుద్ధుడు, పరిశుద్ధుడు, పరిశుద్ధుడు అనియు ప్రక 4:8. యెష 6 : 3. సర్వలోకము ఆయన మహిమతో నిండియున్నదనియు మానకదివారాత్రము గొప్పస్వరముతో గాన ప్రతిగానములు చేయుచుండిరి.

---

" కీర్తనలతో నేను దేవుని నామమును స్తుతించెదను. కృతజ్ఞతా స్తుతులతో నే నాయనను ఘనపరచెదను." దా. కీ. 69 : 30.

ఈస్తుతిస్వర ప్రవాహమువలన గడపకమ్ములు పునాదులుకదిలి మందిరము ధూపముచేత నిండిపోయెను. పరలోక మహిమసింహాసనా సీనుండగు దేవుని ఎదుట, సర్వలోక ప్రతినిధులగు నాల్గుజీవులును, యిరువదినల్గురు పెద్దలును తమకిరీటములనుదించి, సాగిలపడి, నమస్కారముచేయుచు యుగయుగములు జీవించుచున్నవానికి మహిమ,ఘనత,కీర్తి, ప్రభావము, కృతజ్ఞతాస్తుతులు కలుగుగాకని స్తోత్రారాధనచేసిరి. ప్రక 4 : 9-12. ఆలాగైతే మనమెంత నధికముగా ఆయనను స్తుతించుటత్యావసరమో గ్రాహ్యమగుచున్నది. అట్టి నిరంతరస్తోత్రార్పణము చెల్లించునరుడెంతో ధన్యుడుగదా. ఆయన మహిమార్థమైస్తోత్రించి, కీర్తించి ఘనపరచి, కొనియాడునట్లు మనలను సృజించెను. యెష 43 : 7. ఎఫె 2 : 10; ఆయననుస్తుతించుడి, ఆయననామమును ఘనపరచుడి. దా. కీ 100 : 3. మన అంతరంగమందుగల దైవప్రేమను, క్రియ, సంభావణ, కీర్తన, స్తుతిస్తోత్రములద్వారాను బహిరంగపర్చగలము. స్తుతి చెల్లించుటవలన దేవుని మహిమపరచుచున్నాము. దా. కీ. 50 : 23; 14. మన ఆధ్యాత్మిక జీవితమునందుస్తుతిచేయుట నొక సుత్కృష్ట సాధనమైయున్నది.

a. మెల్కీసెదకు దేవునిస్తుతించెను. ఆది 14 : 20.
b. భక్తుడైన దావీదు దినమునకేడుమార్లుస్తుతించెను. దా. కీ. 119 : 164.
c. దేవాలయ నిర్మాణమునకై యాజకులు దేవునిస్తుతించిరి. ఎజ్రా 3 : 10;11
d. రోగియైన హిజ్కియాస్వస్థతనొంది చేసినస్తుతి. యెష 38 : 1-20.
e. గొర్రెలకాపరులు క్రీస్తు జననకాలమున స్తుతించిరి. లూక 2 : 20
f. క్రీస్తు నామకరణ సందర్భమున సిమియోనుస్తుతి లూక 2 :28 - 32
g. ప్రవక్త్రియగు అన్నాబాల యేసును స్తుతించుట లూక 2 : 38
h. దృష్టినొందిన గ్రుడ్డివానినిచూచి ప్రజలు స్తుతించిరి. లూక 18 : 43
i. బాగుపడినకుంటివాడు పేతురు యోహానులతో కలిసిస్తుతించెను. కార్య 3:8.

గాన ఆయన దివ్యలక్షణములు తలంచుచు స్తుతించుము. ఆయన చేసిన ఉపకారములను తలంచుచు స్తుతించుము దా. కీ. 103 : 2 ఆయన చేయునైయున్న మేళ్ళకై నిరీక్షణతో స్తుతించుము కష్టములలో, కరువులలో, దుఃఖములలో, ఇబ్బందులలో, ప్రాణాపాయములలో, యోబు, అబక్కూకు, పౌలు, సీల, హన్నా, అపోస్తులులు స్తుతించినట్లు స్తుతించుము. హబ 3 : 7 అ. కా. 16 : 19 - 40; 1 సమూ 2 : 1 లూక 24 : 53 దేవునిసన్నిధిని మానముగానుండుట ద్వారా దేవుని స్తుతించుము. దా. కీ. 65 : 1 విమోచింపబడినవారే అట్టిస్తుతి చేయగలరు. దా. కీ. 107 : 1 దేవుని నామమును స్తుతించుటయు, కృతజ్ఞతాస్తుతులతో ఆయనను ఘనపరచుటయు ప్రీతికరమైన

" కృతజ్ఞతార్పణలు చెల్లించుట మంచిదే, అయితే కృతజ్ఞతాజీవితము జీవించుట అంతకన్న శ్రేష్ఠము." రేమండ్ జె. హాస్.

బలి, నైవేద్యమునై యున్నది. దా. కీ. 69 : 30, 31; 107 : 22 యిర్మీ 17 : 26, 33 : 11. అట్టి స్తుతిజీవితమే జిహ్వాఫలము. ఈ జిహ్వాఫలమర్పించెదము. హెబ్రీ 13 : 15; హోషే 14 : 2. నేనెల్లప్పుడు యెహోవాను స్తుతించెదనని రాజశేఖరుడగు దావీదు తెల్పుచున్నాడు. దా. కీ. 34 : 1; 35 : 28; 51 : 14. దావీదు స్తుతిసంకీర్తనమువలన సౌలురాజులోఉన్న దయ్యము పారిపోయెను. 1 సమూ 16 : 23; 18 : 10. స్తుతి అపవాదికి అపజయము, దయ్యములకు బెదురు, లోకులకు తొందర, పాపమునకు వణకు కలిగితీరును. దావీదుగొల్యాతుపై విజయమొందగా స్త్రీలు వాయిద్యములతో దేవునిస్తుతించుచు జయభేరి మ్రోగించిరి. 1 సమూ 18 : 6, 7. దావీదుపురమున మందసము ప్రవేశించు సంతోష శుభసందర్భమున స్త్రీలధికముగా స్తుతించిరి, 2 సమూ. 6 : 5, 14 దావీదు స్తుతిగానముద్వారా దేవునిని మాత్రమే గాక పశ్చిక బయలునందున్న గొఱ్ఱెలసమూహముల నాకర్షింపగలిగెను. ఇట్టి స్తుతులమూలమున ప్రభువు ఒక దుర్గమును స్థాపించును. దా. కీ. 8 : 2 దుర్గమనగా కోట ఈస్తుతులకోటలో సుక్షేమానందభక్తులై జీవించువారి చెంతకు సాతాను దాటిరాజాలడు. ఎందుకనగా అచట ప్రభువే ఆశీనుడై యున్నందున. కీర్త 22 : 3 స్తుతిచేయుట ఎంతో ధన్యత దా. కీ. 106 : 3; 112 : 1; 34 : 1 స్తుతిచేయుట యథార్థవంతులకు శోభస్కరము దా. కీ. 33 : 1; గాన చదువరీ యిట్టి ధన్యత, శోభస్కరమైన జీవితము గలిగి యున్నావా! స్తుతియించు ప్రియుడా సదాయేసుని మీరు దుఃఖపడకుడి యెహోవాయందు ఆనందించుటవలన మీరు బలమొందెదరు. నెహె 8 : 10 గాన ప్రభువునందు స్తుతులమూలమున ఆనందించుడి. ఫిలి 4 : 4 ఈ ఘడియయందే ప్రభువా నానోరు నీస్తుతిని ప్రచురపరచునట్లు నా పెదవులను తెరువుమని దావీదువలె ప్రార్థించుము దా. కీ. 51 : 15; యెహోవాను వెదకువారు ఆయనను స్తుతించెదరు. దా. కీ. 22 : 26. గాన నీవును నీకుటుంబము నీసంఘము స్తుతిచేయుచుంటిరా? హాల్లెలూయా, స్తుతి, స్తోత్రములతో నీజీవితము గడుపుచుంటివా! స్తుతిఅనునదొక మాట దా. కీ. 107 : 1 అది మించి అధికముగా పాడుకొనిన స్తోత్రరూపమగు క్రొత్తపాటయగును. దా. కీ. 40 : 3; ఈపాటలవలనను స్తుతులవలన కోట సిద్ధమగును. కీర్త 8 : 3 ఈకోటలో సురక్షితముగానున్న సగలోకమునకు బాట తెరువబడును. దా. కీ. 50 : 23 తోటలోచేరి చిట్టత్రాగి ఫలించి, ఫలసమృద్ధిమూటలో చేరుకొనుము. కాబట్టి దేవుని దూతలేమి. దా. కీ. 103 : 19 - 22; 148 : 2; అన్యజనులేమి, సర్వజనులేమి దా. కీ. 117 : 1, 2; [illegible]లేమి దా. కీ.

---

"ప్రకృతిని, పరిశుద్ధ గ్రంథమును పఠించిన కొలది నాయానందమంత కంతకు హెచ్చాయెను." Dr. A. విల్సన్

108 : 1, 12; యౌవ్వనులు, కన్యకలు, వృద్ధులు, బాలురు, కొద్దివారేమి. గొప్పవారేమి, వీరందరు ఆయనను స్తుతించుడి. దా. కీ. 148. అధ్యా. భక్తులు ఘనతనొంది ప్రహర్షించుదురుగాక ! దా. కీ 149 : 5, 6; 30 : 4. సకలప్రాణులు యెహోవాను స్తుతించుదురుగాక. దా. కీ. 150 : 6. శాశ్వత కాలమునుండి శాశ్వతకాల పర్యంతము యెహోవా నామము స్తుతినొంద దగినది. దా. కీ 41 ; 13. సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమయము వరకు యెహోవా నామముస్తుతినొందదగినది. దా. కీ. 113 : 3. ప్రియుడా నీజీవిత సర్వకాలసర్వావస్థలయందు స్తుతింపనేర్చుము. నేను ప్రజలందరిలో నిన్నుగూర్చిస్తుతిగానముచేసెదను. దా. కీ. 108:3. గాన ప్రతివిషయమునందు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుడి. ఈ లాగుచేయుట యేసుక్రీస్తునందు మీ విషయములో దేవుని చిత్తము. 1 థెస్స. 5 : 17, 18. యెహోవాకు కృతజ్ఞ తాస్తుతులు చెల్లించుడి. ఆయన నామమును ప్రకటనచేయుడి ఆయననుగూర్చి పాడుడి ఆయననుకీర్తించుడి. ఆయన అద్భుత కార్యములనుగూర్చి సంభాషణ చేయుడి. ఆయన పరిశుద్ధనామమునుబట్టి అతిశయించుడి. యెహోవాను వెదకువారు హృదయమునందు సంతోషించుదురుగాక. 1 దిన 16 : 7-11.

"నీతిమంతుల గుడారములలో రక్షణనుగూర్చిన ఉత్సాహ సునాదము వినబడును. దా. కీ. 118 : 15; 68 : 3; 66 : 1, 2 యెష 42 : 10-12 ; 63 : 1, 2 కీర్త 71 : 23 దా. కీ. 69 : 30; 28 : 7; 44 : 8 ; 92 : 1; స్తుతివస్త్రముడు ఆయన మనకొరకు సిద్ధపరచియున్నాడు. యెష 61 : 3. నీవు నాగోనెపట్ట విడిపించి సంతోష, ఉల్లాస వస్త్రము నన్ను ధరింపచేసి యున్నావు. యెహోవా నాదేవా నిత్యమునేను నిన్ను స్తుతించెదను. దా. కీ. 30 : 12; 71 : 6; 100 : 1; 10 ప్రభువగు యెహోవా నీతిని స్తోత్రమును ఉజ్జీవింపజేయును. యోబు 29 : 14 యెష 61 : 11 గనుక మేమైతే యిది మొదలుకొని నిత్యము యెహోవాను స్తుతించెదము" దా. కీ. 115 : 18.

## కనిపెట్టుట (ప్రభుపాదసన్నిధి)

"యెహోవా సన్నిధిని మౌనముగానుండుడి" జఫ 1:7జఖ2:13.

అబ 2 : 20; దా. కీ 37 : 7. నీసన్నిధిని సంతోషముతో అతని ఉల్లసింపజేసియున్నావు. దా. కీ 21 : 6. దేవుని సన్నిధిని మంచిదిగాని చెడ్డదిగాని మరియేయితరతలంపైనను రానివ్వక ప్రభువు సన్నిధిలో నేను ఉన్నాను. తండ్రి, కుమార, పరిశుద్ధాత్మయైన ప్రభువు నాయెదుట ఉన్నారనినమ్మి నా ప్రార్థన వినెనారనినమ్మి, ఏమిజవాబు యివ్వగలడోయని

"దేవుని వాక్యమందే జనులందరును, జనాంగములన్నియు, వెలుగును నిరీక్షణను, ఆదేశమును, సహాయమును పొందుదురు." B. F. వెస్ట్కట్.

మౌనముగాయుండి, కనిపెట్టవలెనేగాని, ఆమెన్ అని వచ్చివేయుట
మర్యాదగాదు. మనమొకరిని పిలుచునపుడు అవతలివారు పలుకువరకు పిలుచు
చునేయుందుముగదా. వారువచ్చి జవాబు చెప్పువరకు కనిపెట్టుకొని
యుందుముగదా అలాగే దైవసన్నిధిని కీర్తనలు, వాక్యము, ప్రార్థనలు
ముగించినపిదప కనీసము ఒక గంటకాలమైనను మౌనముగా కనిపెట్టుట
ద్వారా గొప్ప అనుభవములోనికి నడిపింపబడుదురు. ప్రార్థన కాలములో
నీవు దేవునితో మాట్లాడుదువుగాని కనిపెట్టుకాలములో ప్రభువు నీతో
మాట్లాడును. ప్రభువు నీతో మాట్లాడువరకు ఆశక్తితో
ఆయనకొరకు వేచియుండుము. పూర్వకాలమందు ప్రవక్తలు ఎంతో
ఆశక్తితో కనిపెట్టుటవలన గొప్ప గొప్ప ప్రవచనగ్రంథములను వ్రాయ
గలిగిరి. దర్శనములు చూడగలిగిరి. దేవునిచిత్తమును తెలిసికొని ప్రతికార్యము
చేయగలిగిరి. జవాబుదొరుకువరకు దైవసన్నిధిని నివసించినయెడల ఎంత
మేలు. ప్రార్థించినాము అను సంతోషమేగాక దేవుడు జవాబుయిచ్చినాడను
సంతోషముకూడ మనకు కలుగకూడదా! "ఈ కీడు యెహోవా వలనకలుగు
చున్నది. నేను యికనెందుకు యెహోవా కొరకు కనిపెట్టియుండవలెను?
అని ఒక అవిశ్వాసిలికినట్లు మనమును పలుకకుందుముగాక" 2 రాజు 6:33.
అవిశ్వాసి దేవునిని యితరులను విమర్శించునుగాని విశ్వాసితన్నుతాను విమ
ర్శించుకొని దేవుని సహవాసానుభవము కలుగునట్లు దైవసన్నిధిని ఓపికతో
కనిపెట్టును. ప్రభువురాకడ సమీపమైయున్న కాలములో సిద్ధపడుటకు
కనిపెట్టు సమయమొక గొప్పసాధనమైయున్నది. యోవే 2:16. చేసి
చూడండి. దాని అద్భుతకరమైన అనుభవమునుపొందక మానరు. నీవేస్థితి
యందున్నను వాటినిబట్టి కనిపెట్టుట మానుకొనక వెళ్లి దైవసన్నిధిని కని
పెట్టుము విశ్వాసము, ఆనందము ఎంతో వృద్ధియగును. నీ కఠినప్రశ్నలన్నిటికిని
జవాబుదొరుకును. ఆత్మబలపడును. దైవచిత్తము తెలుపబడును. బోధవినుట
యందు ప్రీతిహెచ్చును. ప్రతిపాపము నొప్పుకొని విసర్జింతువు పాపముపై
జయమునొందుదువు ప్రార్థించుటయందెడ తెగకనుందువు. సువార్తను ప్రక
టించకుండనుండలేవు. నిరాశ, విసుగుదల, సందేహము గర్వము అను, మాన
సిక మలినములన్నియు కనిపెట్టుటద్వారా దైవసన్నిధిని అంతరించును.
కృపలో పెరుగుచు ప్రతిష్ఠితా జీవితమును ప్రారంభించుదువు. కనిపెట్టుకొను
టకు సమయమున్నను స్థలముదొరుకదు. స్థలముదొరికిన సమయము దొరుకదు.
స్థలము, సమయము దొరికినను మనసుకుదరదు. బయటఅల్లరి వినబడుచుండును

---

"నేను నాజీవితములో క్రీస్తును అన్నింటి కన్న, అందరికన్న హెచ్చిం
చుటయే ఉన్నత క్రైస్తవానుభవమునకు ఎక్కిపోవుటకు మొదటి మెట్టు"
హెన్రీ రాట్లిఫ్.

నిద్ర, నిద్రఅందువేమో విస్తారముగా ఆలోచింపకుము ఆటంకములన్నిటిని త్రోసివేసి ఎక్కడో ఒకచోట వీలుచేసికొని కనిపెట్టుము. ఎన్నో భాగ్యములు ప్రభువు మీకు అందించును. ఏలియాకర్మెలు పర్వతముపై ప్రార్థించి కనిపెట్టుచునేయుండెను. ఇట్లు ఏడుమార్లు ప్రార్థించి నెరవేర్పుకొరకు కనిపెట్టెను తుదకు నెరవేర్పుకలిగెను. 11 రాజు 18 అధ్యా, అట్లే నీ ప్రార్థనకు నెరవేర్పు వెంటనేరాలేదని నిస్పృహజెందక ప్రార్థించుచు కనిపెట్టుచునే యుండుము అప్పుడు ప్రార్థనా నెరవేర్పు నొందుదువు ప్రతివారు ఏకాంతమందుగాని లేక ఒకచోట కొందరుచేరి సన్నిధికూటము నేర్పాటుచేసికొని జరిగించిన అట్టివారిమధ్య దేవుడు తనఆశ్చర్యకార్యములను జరిగించును. దైవ సహవాసానుభవము వృద్ధిగాంచును. దేవా సీయోనులో మౌనముగానుండుట నీకు స్తుతిచెల్లించుటే ! దా. కీ 65 : 1. నీకొరకు కనిపెట్టువారిలో ఎవరును సిగ్గునొందరు. దా. కీ. 25 : 3 యెహోవా కొరకు కనిపెట్టుకొనియుండుము ధైర్యము తెచ్చుకొని నీ హృదయమును నిబ్బరముగా నుంచుకొనుము. దా. కీ. 27 : 14. యెహోవా కొరకు కనిపెట్టుకొని యుండుము ఆయన మార్గము ననుసరించుము. భూమిని స్వతంత్రించుకొనునట్లు ఆయననిన్ను హెచ్చించును. దా. కీ 37 : 34, 9. యెహోవా కొరకు నేనుసహనముతో కనిపెట్టుకొంటిని. ఆయన నాకు చెవియొగ్గి నామొర్ర నాలకించెను. దా. కీ. 40 : 1. నా ప్రాణమా, దేవుని నమ్ముకొని మౌనముగానుండుము. ఆయన వలననే నాకు నిరీక్షణకలుగుచున్నది. దా. కీ 62 : 5; 130 : 5. కీడుకు ప్రతికీడు చేసెదననుకొనవద్దు. యెహోవా కొరకు కనిపెట్టుకొనుము ఆయన నిన్ను రక్షించును. సామె 20 : 22. ఆదినమున జనులీలాగందురు. ఇదిగో మనలను రక్షించునని మనముకనిపెట్టికొనియున్న మనదేవుడు. మనముకనిపెట్టికొనిన యెహోవా ఈయనే యెష 25 : 9. నా ప్రాణము యెహోవా కొరకు కనిపెట్టుకొనుచున్నది. ఆయనే మనకుసహాయము మనకుకేడెముగానున్నాడు. యెహోవా మేమునీకొరకు కనిపెట్టుచున్నాము. దా. కీ 33 : 21; 22. కృపమామీదనుండునుగాక !

యెహోవాను నమ్ముకొని నేను ఎదురుచూచుచున్నాను ఆయనకొరకు నేను కనిపెట్టుచున్నాను. యెష 8 : 17; 26 : 8 యెహోవా నీకొరకు కనిపెట్టుచున్నాము, మాయందు కరుణించుము ఉదయకాలమున వారికి బాహువుగాను, ఆపత్కాలమున మాకు రక్షణాధారముగా నుండుము. యెష 33 : 2 దావీదు దేవునికొరకు కనిపెట్టుకొనుటచేత నాకన్నులు క్షీణించెను. అని వ్రాయుచున్నాడు. దా. కీ. 69 : 3 ఎంతగొప్ప సహనము

---

" ఎవరు తన్ను తాను సంపూర్ణముగా దేవునికి సమర్పించుకొందురో, వారెల్లప్పుడు ఆయనకే లోబడి యుండును." బాస్ ధసకిస్.

యిదే కనిపెట్టు పట్టు, తేనెపట్టు ఎంతశ్రేష్టమో యీ కనిపెట్టు పట్టు అంత శ్రేష్టముగా ఆపట్టు చేపట్టుము. అయినను వారు ఆయన కార్యములను వెంటనే మరచిపోయిరి. ఆయన ఆలోచనకొరకు కనిపెట్టుకొనక పోయిరి. కీర్త 106 : 13 తనకొరకు కనిపెట్టువారి విషయమై నీవుతప్ప తన కార్యము సఫలము చేయుమరి ఏదేవునిని, ఎవడు, ఏకాలమున చూచియుండలేదు. అట్టి దేవుడు కలడన్న సమాచారము మనుష్యులకు వినబడలేదు. అట్టిదేవుడు వారికి తెలిసియుండలేదు. యెష 64 : 4 యెహోవాకొరకు ఎదురుచూచు వారు నూతన బలము పొందుదురు. వారు పక్షిరాజులవలె రెక్కలు చాపి పైకెగురుదురు అలయక పరుగెత్తుదురు. సొమ్మసిల్లక నడచిపోవుదురు. యెష 40 : 31 ఆయననాకు ఏమిసెలవిచ్చునో, నావాదము విషయమై నేనేమి చెప్పుదునో చూచుటకై నేను నా కావలిస్థలము మీదను గోపురము మీదను కనిపెట్టుకొని యుందుననుకొనగా యెహోవా నాకీలాగు సెలవిచ్చెను. చదువువాడు పరుగెత్తుచూ, చదువవీలగునట్లు నీవుఆదర్శనవిషయము పలకమీదస్పష్టముగా వ్రాయుము. ఆదర్శనము నిర్ణయకాలమున జరుగును. సమాప్తమగుటకై ఆతురపడుచున్నది. అదితప్పక నెరవేరును అదిఆలస్యముగా వచ్చినను దానికొరకు కనిపెట్టుము. అదితప్పక జరుగును. జాగుచేయక వచ్చును హబ 2 : 1 - 3 ఆయన వారిని కలుసుకొని ఈలాగు ఆజ్ఞాపించెను. మీరు యెరూషలేమునుండి వెళ్ళక నావలనవినిన తండ్రియొక్క వాగ్దానముకొరకు కనిపెట్టుడి. అ.కా 1:4 యెహోవా నీరక్షణకొరకు కనిపెట్టుకొనియున్నాను ఆది 49 : 18 యెహోవా నీకొరకు కనిపెట్టుకొను వారికి నావలన సిగ్గు నొందనీయకుము. కీర్త 69 : 6 నీనామము భక్తులదృష్టికి ఉత్తమమైనది. నేను దానిని స్మరించి కనిపెట్టుచున్నాను. కీర్త 52 : 9 తగినకాలమున నీవువాటికి ఆహారమును దయచేసెదవని యివన్నియు నీదయకొరకు కనిపెట్టుకొని యున్నవి. కీర్త 104 : 27 దాసులకన్నులు తన యజమానుని చేతితట్టును, దాసురాలికన్నులు తనయజమానురాలి చేతితట్టును చూచునట్లు మనదేవుడైన యెహోవా మనలను కరుణించువరకు మనకన్నులు ఆయనతట్టు చూచుచున్నవి. యెహోవా ఆలస్యముచేయుచున్నాడు. మిమ్మును కరుణింపవలెనని ఆయన నిలువబడియున్నాడు. యెహోవా న్యాయముతీర్చు దేవుడు ఆయన నిమిత్తము కనిపెట్టుకొను వారందరు ధన్యులు యెష 30 : 18. రాజులునిన్ను పోషించు తండ్రులుగాను, రాణులు నీకు పాలిచ్చుదాదులుగాను ఉండెదరు. వారు భూమిమీద సాగిలపడి నీకు నమస్కారము చేసెదరు. అప్పుడు నేను యెహోవా ననియు నాకొరకు కనిపెట్టువారు అవమానము నొందరనియు

---

"బలహీనత, ఫలింపక పోవుటయొక్క ముఖ్యకారణము **మేమనగా,** ప్రార్థించుటలో వెనుకబడి పోవుటయే!" రిచ్చర్డ్. న్యూటన్.

నీవు తెలిసికొందువు. యెష 49 . 23. జనులవ్యర్థదేవతలలో వర్షము కురిపింపగల వారెవరైననున్నారా? ఆకాశము దాని నియ్యగలదా, మాదేవుడవైన యెహోవా నీవేగదా దానిచేయుచున్నావు....నీకొరకే మేము కనిపెట్టుచున్నాము. యిర్మి 14 : 22. నరులు ఆశగలిగి యెహోవా అనుగ్రహించు రక్షణకొరకు ఓపికతో కనిపెట్టుట మంచిది. విలా 3 : 26. కాబట్టి యెహోవా సెలవిచ్చువాక్కు ఏదనగా నాకొరకు కనిపెట్టుడి, నేను లేచి ఎరపట్టుకొను దినముకొరకు కనిపెట్టియుండుడి. నా ఉగ్రతను నాకోపాగ్ని అంతటిని, వారిమీద కుమ్మరించుటకై అన్యజనులను ప్రోగుచేయుటకును, గుంపులుగుంపులుగా రాజ్యములను సమకూర్చుటకు నేను నిశ్చయించుకొంటిని నారోషాగ్నిచేత భూమియంతయు కాలిపోవును. జఫ 3 : 8 అది విడువబడిన దినమున నేనుచెప్పినది యెహోవావాక్కు అని మందబలహీనములై నన్ను కనిపెట్టుకొని యున్న గొఱ్ఱెలు తెలుసుకొనెను. జఖ 11 : 11. యెరూషలేమునందు సుమియోనను ఒక మనుష్యుండుండెను. అతడు నీతిమంతుడును, భక్తిపరుడునైయుండి ఇశ్రాయేలు రక్షణకొరకు కనిపెట్టువాడు పరిశుద్ధాత్మ అతనిమీదనుండెను. లూక 2 : 25 తమప్రభువు పెండ్లివిందునుండి వచ్చి తట్టగానే అతనికి తలుపుతీయుటకు అతడెప్పుడు వచ్చునోయని అతని కొరకు ఎదురుచూచు మనుష్యులవలె యుండుడి లూక 12 . 36 మనము చూడనిదానికొరకు నిరీక్షించినయెడల ఓపికతో దానికొరకు కనిపెట్టుదము. రోమా 8 : 25 యెహోవా సన్నిధిని నివసించువారికి సంతుష్టినిచ్చు భోజనమునకును: ప్రశస్తవస్త్రములకును ఆపట్టణపు లాభము ఆధారముగా నుండును. యెష 23 : 18 "అయనను నేను యెహోవాకొరకు ఎదురుచూచెదను. రక్షణ కర్తయగు నాదేవునికొరకు నేను కనిపెట్టియుందును. నా దేవుడు నాప్రార్థన నాలకించును" మీకా 7 : 7.

"అనుదినము దేవునికి సమయమిమ్ము. దైవప్రత్యక్షత నీకు లభించుటకుగాను దేవునికి సమయమిమ్ము. దైవసన్నిధిని మౌనముగానుండుటకుగాను అనుదినమును సమయమును ప్రత్యేకించుము. అప్పుడు నీవు దైవాత్మతో నింపబడుదువు. ఆయన సన్నిధి నీచుట్టునున్నట్లు దృఢనిశ్చయత నీయందు ఏర్పడును. ఆయన ప్రభావశక్తి నీయందు పనిచేయును" —హడ్సన్ టైలర్.

# ప్రార్థన మెట్లు

( సన్నిధిగదిలో మోకరించి ప్రార్థించవలసిన క్రమము )

1 వ మెట్టు - మనోనిదానము:- చెడ్డ, మంచి, ఉన్నవి, రాబోవునవి, వెనుకటివి సమస్తమును మరువవలెను. మనస్సును మరిదేనిమీదకు వెళ్లనీయక

---

"ఏకాంత ప్రార్థన, ధ్యానము తగ్గించి, ఎక్కువ ప్రసంగములను సిద్ధపరచుట ద్వారా నాకు దేవుని పరిచయము తగ్గిపోయెను" హెన్రీ మార్టిన్.

నీయెదుట త్రియేక దేవుడు ఉన్నాడనినమ్మి వినయభయభక్తులతో మనో నిదానము నిలుపవలెను. యిది కుదరనిదే ప్రార్థించరాదు.

**2. వ మెట్టు – స్తుతి:–** ప్రార్థించుటకు, సమయమును, స్థలమును, వీలును నిదానమును కలిగించిన తండ్రిని స్తుతించుము.

**3. వ మెట్టు – పాపపు ఒప్పుదల:–** దేవుడిచ్చిన పదియాజ్ఞలను తలంచుకొనిన మనలోయున్న పాపములన్నియు జ్ఞప్తికివచ్చును. ఆజ్ఞాతిక్రమమే పాపము. నిర్గమ 20:1–20; 1 యోహా 3:4. మహావేదన కన్నీళ్లుగార్చి నీఅతిక్రమములన్నియు దేవునిఎదుట ఒప్పుకొనవలెను. అనగా తలంపు, చూపు, మాట, వినికిడి, ప్రయత్నము, క్రియ, విధులుమానుట అయోగ్యత, చెడ్డకలలు, జంతువులయెడలనిర్దయ, వస్తువులనుసరిగా వాడకపోవుట వీటిమూలముగా జేసినపాపములవలన దేవుని దుఃఖపెట్టితినిగదాయని దేవునికి మొర్రపెట్టవలెను. మనుష్యులకు విరోధముగా జేసినపాపములు ఆమనుషుల ఎదుట నొప్పుకొనవలెను. అవి దేవుని ఎదుట నొప్పుకొనవలెను.

**4. వ మెట్టు – విశ్వాసము:–** ప్రభువా నీవుదయాళుడవు క్షమించుటకు సిద్ధమైన మనసుగలవాడనియు, దా. కీ 86 : 5. క్షమించితివనియు నమ్మవలెను. 1 యోహా 2 : 12; దా. కీ 130 : 4; 1 యోహా 1 : 9.

**5. వ మెట్టు స్తుతి:–** క్షమించిన తండ్రిని స్తుతించుము, క్షమించుటలో నీతోసముడెవరు ? రక్తవర్ణమైనను శుద్ధిచేతునన్నావు యెష 1 : 18. త్రోసివేయనన్నావు. దా. కీ 51 : 11. యోహా 6 : 37. గనుకనే నీకు స్తుతులు ఆనందబాష్పములతో యిచ్చుతీరునంతసేపు స్తుతించుము.

**6. వ మెట్టు – తీర్మానము:–** చెడుగునుమానెదను, మంచినేచేయుదును విధులు నెరవేర్తును. కష్టములందు, నష్టములందు నిన్నే స్తుతింతును. ప్రార్థన నెరవేరనప్పుడును స్తుతింతును. బైబులును నేర్చుకొందును. ప్రార్థనాధ్యానము మానను. సాక్షు సువార్త బోధింతును కృతజ్ఞతార్పణములు చెల్లింతును. లేనిపోని కోరికలనుకోరను నాకు తెలిసినపాపములు యికచేయను. నీవుచెప్పినదే చేయుదును. నాయిష్టప్రకారముగాదు. నీయిష్టప్రకారమే చేయుదును ఎన్నిశోధనలు, ఎన్నికష్టములు, ఎన్నినిందలు ఎన్నిసందేహములు, ఎన్ని ఆటంకములు, ఎన్నియిబ్బందులు, ఎన్నినష్టములు ఎన్ని క్రీస్తు విరుద్ధబోధలు యున్న నిన్నువిడువను. ఇదేనావ్రతము అని దేవునిఎదుట తీర్మానించవలెను. దేవుడు నీ తీర్మానములను ముద్రించి నిన్ను భద్రముగా నడిపించును.

---

"మనఅజ్ఞానమును మనముగుర్తించినచో, విజ్ఞానమను మందిరములో ఒకఅడుగు పెట్టితిమన్నమాట" స్పర్జన్.

**7. వ మెట్టు - సమర్పణ:—** తండ్రీ! నీవు నాకిచ్చినవన్నియు నీకు సమర్పించుకొనుచున్నాను. అనగా నాశరీరము, నాఆత్మ, నాఆస్తి, నాసేవ, నాకష్టము, నాజీవితకాలము నీకు సమర్పించుకొనుచున్నాను.

**8. వ మెట్టు—స్తుతి:—** దేవా నాపాపములన్నియు క్షమించినావనియు, నా తీర్మానములన్నియు నీవు అంగీకరించియున్నావనియు నమ్మి ఆనందించుచూ నిన్ను స్తుతించుచున్నాను.

**9. వ మెట్టు - అంశప్రార్థన:—** ఈ మెట్టుమీద యిష్టమున్న అంశముపై ప్రార్థించవచ్చును. ప్రార్థనావాలు, బైబిలులోని అనుభవము, వాక్యబోధనా శక్తి, పాపములను గెలుచుబలము, ఆరోగ్యము, విద్య, ముఖ్యముగా పరిశుద్ధాత్మ కుమ్మరింపుకొరకు అవసరమైన మంచిదైన ఉదహరించి దయ చేయుమని ప్రార్థించవలెను.

**10. వ మెట్టు - విశ్వాసము:—** ఈ మెట్టుమీద 9-వ మెట్టుమీద అడిగినది దొరికినదని నమ్మవలెను.

**11. వ మెట్టు - స్తుతి:—** 9-వ మెట్టుమీద అడిగినది దొరికినదని హృదయానందముతో స్తుతించుము.

**12. వ మెట్టు—కనిపెట్టుట:—** ఈ మెట్టుమీద ప్రభువువిన్న నీ ప్రార్థనలకు ఏమిజవాబుయిచ్చునోయని మౌనముగా కనిపెట్టవలెను. (గంటకు తగ్గరాదు) మరా:- ఈ మెట్టుమీద యిష్టమున్నంతసేపు యుండవచ్చును. ఒకసారి చేసినప్రార్థన మరలా చేయక దానికిబదులు ఎన్నిపర్యాయములైనను స్తుతిచేయవచ్చును. స్తోత్రగీతములు పాడవచ్చును. దేవుడు నీతో మాట్లాడి ప్రార్థనకు జవాబుయిచ్చువరకు సన్నిధిలో మౌనముగా వేచియుండవలెను—

"మనము దేవునిస్వరమును వినువారమై యున్నయెడల ఎన్నడును నిరాశపడము."—మేరి మోర్సు.

"నీతియొక్క పని శాంతము. నీతియొక్క ఫలితము ఎల్లప్పుడు మౌనము, వాగ్దానము."

"అగ్నిలో పుట్టినవాడు సూర్యుని వేడిమికి వాడిపోడు."—ఈ. పాల్ హాడీ

# కుటుంబ ప్రార్థన

**"నేనును నాయింటివారును యెహోవాను సేవించెదము."**

**యెహోషువా 24 : 15**

కుటుంబ నిర్మాణకుడు దేవుడే. మొదట ఆదామవ్వలను దేవుడు కుటుంబముగా ఏర్పరచి అభివృద్ధిపొంది భూమిని నిండించి ఏలుడనియు దీవించెను.

ఇల్లుకట్టువాడు ఆయనే. కుమారులు యెహోవాయిచ్చు బహుమానమే దా. కీ. 127 : 1, 3. గనుక మన మాయనవారము. ఆయన మన గృహయజమాని, పోషకుడు, వైద్యుడు, రక్షకుడు యోహా 1 : 12; కీర్త 95 : 1-7. అట్టి మహోపకారియైన దేవునిసన్నిధిని ప్రతి కుటుంబముకూడి ఆరాధించుట బహుశ్రేష్టమైన బల్యర్పణవంటిది. గాన నీకుటుంబ నైవేద్యములు ఉదయ సాయంకాలములందు అనుదినము సముఖపుబల్లమీద పెట్టబడుచున్నవా ? ఆదిలో షేతు కుటుంబముద్వారా ప్రార్థన ప్రారంభమైనది. ఆది 4 : 26. అప్పటినుండి ప్రార్థన జీవజల బుగ్గగా ఉబికి, పొంగి, వెల్లువలై ప్రవహించు చుండెను. లోకమంతటియందును, నోవాహు వానికుటుంబము నీతిమంతులునై యుండి ప్రార్థనాపరులగుటచేత ప్రళయమును తప్పించుకొనగలిగిరి. ఆది 8:20, 21; 9 : 1. కుటుంబప్రార్థన కుటుంబమును రక్షించును. అబ్రహాముకూడ తనతోపాటు తనకుటుంబమును ప్రత్యేకించుకొని ప్రయాణమై కుటుంబముతో సహా బేతేలువద్ద గుడారమువేసికొని, బలిపీఠముకట్టి యెహోవానామమున ప్రార్థనచేసెను. ఆది 12 : 8; 13: 14; 21 : 33. ఇస్సాకును ప్రార్థించెను. ఆది 24 : 63; 25 : 21; 26 : 25. యాకోబు దేవునిని కుటుంబసహితముగా ఆరాధించెను. ఆది 35 : 2-15. యోబు అరుణోదయమునలేచి తన కుటుంబముకొరకు దహనబలి అర్పించుచు వచ్చెను. నిత్యమాలాగుచేయుచుండుట చేత దేవుడా యింటికిని, అతనికి గలిగిన సమస్తమునకు కంచెవేసి కాపాడుచు అధికముగా దీవించెను. అందుచేత అతని ఐశ్వర్య మధికముగా విస్తరించెను. యోబు 1 : 1, 5; 10 : 42 అట్లే మనమును ఆ విశ్వాసగృహములకు తగినట్లు కుటుంబ ఆరాధన జరిగించుచున్నామా? లేనియెడల దేవునిదీవెన మనగృహము పైకెట్లురాగలదు. నారుమడికి నీరు ఎంత అవసరమో ప్రతి కుటుంబమునకు ప్రార్థన అంతఅవసరము. ప్రార్థనలేని కుటుంబము దీపములేని గృహము వంటిది. ప్రాణులకు గాలి ఎంతఅవసరమో ప్రతివానికి ప్రార్థన అంత అవసరము. దేవుడు కుటుంబమును (1) కలిసికొని ఆరాదించుకొనుటకును మత్త 18 : 20 (2) కలిసినివసించుట - ఐక్యతకును కీర్త 133 : 1 (3) కలిసి జీవించుట - సౌఖ్యమునకును. కార్య 2 : 44 (4) కలిసి స్తుతించుట— ఆనందస్తుతి గానములుచేయుటకును. కీర్త 34 : 3 (5) కలిసి కొనిపోబడుట మహిమకును 1 థెస్స 4 : 17; యోహా 14 : 2 ఏర్పాటుచేసి యున్నాడు. పరి|| పౌలు యిట్టి శ్రేష్టకుటుంబముగా తయారగు నిమిత్తమే ప్రార్థించుచున్నానని చెప్పుచున్నాడు. "పరలోకమందును భూమిమీదను ఉన్న ప్రతి

---

"నీవు యౌవనేచ్ఛలను విసర్జించి, పవిత్రహృదయులై ప్రభువునకు ప్రార్థన చేయువారితోగూడ నీతిని, విశ్వాసమును, ప్రేమను, సమాధానమును సంపాదించుకొనుటకు ప్రయాసపడుము" 2 తిమో 2 : 22

కుటుంబము ఏతండ్రినిబట్టి కుటుంబమని పిలువబడుచున్నదో ఆతండ్రి యెదుట మోకాళ్ళూని మీరు అంతరంగ పురుషునియందు శక్తికలిగి ఆయన ఆత్మవలన బలపరచబడునట్లుగాను...........ప్రార్థించుచున్నానని ఎఫె 3 : 14లో వ్రాయుచున్నాడు. దేవునికి బహిరంగసాక్ష్యమై యుండు నట్టిది. ఆదర్శప్రాయమైన కుటుంబమే. కొల. 3 : 18 - 26 కుటుంబము వర్ధిల్లుటకు మొదట తల్లిదండ్రులు రక్షింపబడినవారై యుండవలెను. తల్లి దండ్రులు సరిలేనియెడల పిల్లలనేలాగు క్రమశిక్షలో పెంచగలరు? తల్లి దండ్రులే పిల్లలకు మార్గదర్శులుగా నుండవలెను. ఎఫె 5 అధ్యా "నీ లోగిట నీభార్యఫలించు ద్రాక్షావల్లివలెను నీభోజనపుబల్లచుట్టు నీపిల్లలు ఒలీవమొక్కల వలెను ఉందురు. దేవునియందు భయభక్తులుగలవారి కుటుంబ మాలాగు ఆశీర్వదింపబడును. దా. కీ. 128 : 3, 4. మీరు మీదేవుడైన యెహోవా మిమ్మునాశీర్వదించి మీకుకలుగజేసిన మీకుటుంబకులును, మీదేవుడైన యెహోవాసన్నిధిని భోజనముచేసి మీచేతిపనులన్నిటియందు. సంతోషింప వలెను. ద్వితి 12 : 7 గాన పరిశుద్ధకుటుంబముల నిమిత్తము ప్రార్థించ వలెను. కుటుంబప్రార్థనయందు స్తుతికీర్తనలు, వాక్యపఠనము, ప్రార్థన, స్తుతించుట, కనిపెట్టుట, అను కార్యక్రమములు ప్రతివారికలవడునట్లు శ్రద్ధ వహింతుముగాక! "అప్పుడు కొర్నేలి తనబంధువులను ముఖ్య స్నేహితులనుపిలిపించి ప్రార్థనకొరకు కనిపెట్టుకొనియుండెను. అ. పొ. 10:24

ఏలయనగా యిద్దరు ముగ్గురు నా నామమున ఎక్కడ కూడి యుందురో నేను వారిమధ్య యుందును. వారు ఏకీభవించి ప్రార్థించిన అది వారికి దొరకును. మత్త 18 : 19. ఎట్లనగా యెహోవా అబ్రహామును గూర్చి చెప్పినది అతనికి కలుగజేయునట్లు తన తరువాత తనపిల్లలును తన యింటివారును నీతిన్యాయములు జరిగించుచు యెహోవా మార్గమును గైకొనుటకు అతఁడు వారికాజ్ఞాపించునని "నేనెరిగి యున్నానని"నెను" ఆది 18 : 19 ఈలాగు నీపిల్లలకు నీకుటుంబమును ఆజ్ఞాపించి, యెహోవా మార్గముగైకొనునట్లు ప్రతివారిని నడిపించినయెడల నిన్నుగూర్చి దేవుడాలాగు చెప్పునుగదా, అట్టి సాక్ష్యజీవితము నీవు నీయింటివారు కలిగియున్నారా? గనుక నీవులేచి రేయిమొదటిజామున మొర్రపెట్టుము. నీళ్ళు కుమ్మరించునట్లు ప్రభువుసన్నిధిని నీహృదయమును కుమ్మరించుము. నీపసిపిల్లల ప్రాణము కొరకు నీచేతులను ఆయనతట్టుఎత్తుము. విలా 2 : 19; ఆయన ఆజ్ఞలనుబట్టి అధికముగా ఆనందించువాడు ధన్యుడు. వాని సంతతివారు భూమిమీద బలవంతులగుదురు. యదార్థవంతుల వంశపువారు దీవింపబడుదురు. కలిమియు

---

"నీతిమంతుల నివాసములను ఆయన ఆశీర్వదించును" సామె 3:33 యోబు 8 : 6.

సంపదయు వానియింటనుండును. కీర్త 12 : 2, 3; సామె 8 : 17, 18 మరియు, పిన్నలనేమి, పెద్దలనేమి తనయందు భయభక్తులు గలవారిని యెహోవా ఆశీర్వదించును. యెహోవా మిమ్మును మీపిల్లలను వృద్ధి పొందించును. కీర్త 115 : 13, 14. వారిసంతానము భిక్షమెత్తరు. దినమెల్ల వారు దయాళులై అప్పిచ్చెదరుగాని అప్పుచేయరు. కీర్త 37 : 25, 26; ద్వితి 28 : 1 - 14; నీయవనస్థులలో శ్రేష్ఠులు పరిశుద్ధాలంకృతులై మంచు వలె అరుణోదయగర్భములోనుండి వచ్చెదరు. కీర్త 110 : 3; 102 : 28. వారు భూమిని స్వతంత్రించుకొందురు. దా. కీ. 25 : 13; అకుల ప్రిస్కిల్ల అ. కా. 16 : 4; 1 కొరి 16 : 19. నుంఫాను కొల 4 : 15 ఫిలోమోను. ఫిలో 2 వ - మార్కు అను మారుపేరుగల యోహాను తల్లియైన మరియు అ. పొ 12 : 12; లుదియ అ. పొ 16 : 13 - 15 చెరసాల నాయకుడు అ. పొ 16 : 34. జక్కయ్య లూక 19 : 9 మొదలగువారియింట ప్రతిదినము ప్రార్థనాకూటములు జరుగుచుండెడివి. అపో స్తలులు సహితము యింటింట ప్రార్థనలు జరిగించిరి. అపొ 2 : 46. కావున మనము మాదిరిగానున్న కుటుంబ ప్రార్థనాజీవితము నలవరచుకొనుటద్వారా దైవాశీర్వాదమునొందుదురుగాక! "నీకుటుంబమును పరలోకమునకు సమీపముగా నుండనిమ్ము. ఆయనతో అనుక్షణము ఆనందించుము"—జేమ్సుహామిల్టన్.

"నేను ప్రొద్దునే ప్రార్థనచేయకపోతే కుటుంబప్రార్థనయొక్క శక్తిని, మాధుర్యమును, పోగొట్టుకొని నాయొద్ద ఏమైనా కనుగొనవలెనని వచ్చు వారికి నేను ఏలాంటిమేలుచేయజాలను. మనస్సాక్షి నేరమైనదిగా భావించ బడును. ఆత్మపోషింపబడదు. దీపము సవరించి సిద్ధముచేయబడదు. అప్పుడు ఆత్మ, రహస్యప్రార్థనలో ఐక్యపడదు. దేవునితో దినము నారంభించుట చాల శ్రేష్టమని భావించుచున్నాను. ఆయన సముఖము మొదటచూచుట, ఎవరిని సమీపింపకమునుపు ఆయనకు సమీపముగానుండుట"

—రాబర్టు ముర్రేమెక్చేన్.

"దైవవాక్యానుసారముగా నొక కుటుంబము నడిపించబడినయెడల ఆచోట ఒకరాత్రి గడుపుడని దేవుడు దూతలకాజ్ఞాపించుట ఆశ్చర్యమా"?

—స్పర్జన్.

# సంఘారాధన

"నా ప్రార్థనమందిరములో వారిని ఆనందింపజేసెదను" యెష 56 : 7

విశ్రాంతిదినమును పరిశుద్దదినముగా ఆచరించుటకు జ్ఞాపకముంచుకొనుము. రోమా 29 : 8 దేవుడు ఆరుదినములలో సమస్త సృష్టినిచేసి ఏడవదినమున

---

"తనపిల్లలకు ప్రార్థననేర్పించే తల్లికంటే ఉత్తమస్త్రీ జనసమూహము నకు లభించదు" ఎనరోడ్.

విశ్రమించి దానిని పరిశుద్ధపరచి ఆశీర్వదించెను. ఆది. 2 : 1 - 3. కావున నీవు ఆరుదినములలో పనిచేసి సంఘారాధనదినమైన ఆదివారము ఆయన సన్నిధికి రమ్ము. నిర్గ 34 : 21; 35 : 2 విశ్రాంతిదినమునకు ప్రభువైనయేసు నీకు విశ్రాంతియు, పరిశుద్ధతయు, ఆశీర్వాదమును అనుగ్రహించును. మార్కు 2 : 27, 28 మరియు యెహోవానగు నేనేవారిని పవిత్రపరచువాడనని వారు తెలిసికొనునట్లు నాకును వారికిని మధ్య విశ్రాంతిదినములను వారికిసూచనగా నేనునియమించితిని. ఎహె 20 : 12; నిర్గ 31 : 13; ద్వితి. 5 : 12. అట్టి పరిశుద్ధదినమున కొందరు విందులకు, విలాసములకు, శరీరగృహసంబంధమైన కార్యములకు వినియోగించుచు దేవుని సమయమును దొంగిలించుచు ఆజ్ఞను అతిక్రమించుచు శాపగ్రస్తులగుచున్నారు. ఆయనను ఆరాధించువారు ఆత్మతోను సత్యముతోను ఆరాధించవలెనని యుండగా యోహా 4 : 24 మరి కొందరు అయోగ్యముగా నామకార్థముగా ఆరాధించుచున్నారు. మార్కు 7 : 6, 7; యెష 29 : 13; ఎహె 33 : 31 ప్రార్థనామందిరములు దొంగల గుహలగానున్నవని ప్రభువు సంతాపమునొందుచున్నారు. మార్కు 11:15-17 యోహా 2 : 13 - 17. ఓ కావలివాడా ! నీ సంఘాలయ మెట్లున్నది? నీహృదయాలయమెట్లున్నది? మనమేదేవునికి నిజమైన ఆలయమైయున్నాము. 2 కొరి 3 : 16; 6 : 19. గాన నీదేహముతో దేవునిమహిమ పరచుము. 1 కొరి 6 : 19, 20. ఎవడైనను దేవునిఆలయమును పాడుచేసినయెడల దేవుడు వారిని పాడుచేయును. దేవునిఆలయము పరిశుద్ధమైనది. ఆయన పరిశుద్ధుడుగనుక ఆయనను ఆరాధించువారును పరిశుద్ధులుగా నుండవలెను. నిర్గ 19 : 6. అయోగ్యముగా ఆరాధించువారు బుద్ధిహీనులు, విశ్రాంతి దినము మనోహరమనియు, యెహోవాకు ప్రతిష్ఠితదినమనియు, ఘనమైనది అనుకొని ఘనముగా ఆచరించవలెను. యెష 58 : 13 అది పరిశుద్ధసంఘపు దినము. లేవి 23 : 3 ఆదినమయమునమీరు పరిశుద్ధసంఘముగా కూడుకొనవలెనని ప్రభువానతిచ్చెను. నిర్గమ 12 : 16 దానిలో నీవైనను,నీయింటనున్న వారిలో ఎవరైనను యేపనియు చేయకూడదు. నిర్గ 20 : 10 ద్వితి 5 : 14 ఆదినమున వ్యాపారముచేయుట, బరువులు మోయుట, లోకవార్తలు చెప్పుకొనుట కూడదని వేదము చెప్పుచున్నది. యెష 58 : 13, 14; నెహె 13 : 15,—22; యిర్మి 17 : 21 - 27 అది ప్రత్యేకముగా ఆరాధనకొరకేర్పాటయిన దినముగనుక ఆరాధనమాత్రమే జరిగించవలెను. అదిమించిన శిక్షయేగాని వేరొకటిగాదు. నిర్గ 31 : 14; లేవి 15 : 32 - 35. అలాగైన మనమెన్నిసార్లు ఆజ్ఞలనతిక్రమించి మరణశిక్ష నొందవలసి యున్నాము.

---

"నెనరుగల స్త్రీ ఘనతనొందును; వివేకములేని సుందర స్త్రీ పంది ముక్కునవున్న బంగారుకమ్మివంటిది" సామె· 11:16; 22; 12:4;31:30

దేవుని ఆరాధించనివాడు చచ్చినవానితో సమానమే. ఆది యెహోవా కార్యము గనుక యెహోవా కార్యమును అశ్రద్ధచేసినను, అలక్ష్యముచేసిన వారు శాపగ్రస్తులగుదురు. యిర్మి 48 : 10 ఆదిమక్రైస్తవ సంఘము సబ్బాతును ఆదివారముగా నిర్ణయించిరి. అ. కా 20 : 7 ఆదివారమున సంఘారాధనయందు రొట్టెవిరిచిరి. చందా సమకూర్చి భద్రపరచిరి. 1 కొరి 16 : 2 క్రీస్తు పునరుత్థానమైన దినము ఆదివారము. మత్త 28 : 1 మార్కు 16 : 2, 9 యోహా 20 : 1, 19 పరిశుద్ధాత్మ కుమ్మరింపు ఆదివారము. అందునుబట్టి నవీనసంఘములో అపొస్తలులు ఆదివారమును సంఘారాధనకు నిర్ణయించి క్రమముగా జరిగించిరి. యోహానుకు ప్రభుదర్శనమిచ్చినది ఆదివారమే (ప్రభువుదినము) ప్రక 1 : 10 గాన ప్రతియొక్కరు సంఘారాధనలో ప్రవేశించి పరిశుద్ధులై ప్రార్థించితేనేగాని రేపురాబోవు క్రొత్త భూమ్యాకాశములతో మన ప్రభువు సిద్ధపరచుచున్న నిత్యవిశ్రాంతిలో ప్రవేశింపలేరు. యెష 66 : 23. జఖ 4 : 17 కాబట్టి దేవునిప్రజలకు విశ్రాంతి నిలిచియున్నది ఎందుకనగా దేవుడు తనకార్యములను ముగించి విశ్రమించినప్రకారము ఆయనయొక్క విశ్రాంతిలో ప్రవేసించేవారుగూడ తనకార్యములను ముగించి విశ్రమించును. హెబ్రి 4 : 9, 10 కాబట్టి అవిధేయతవలన వారుపడిపోయినట్లు మనలో ఎవడును పడిపోకుండా ఆవిశ్రాంతిలో ప్రవేశించుటకు జాగ్రత్తపడుదము. హెబ్రి 4 : 11 అందువలన సహోదరులారా ! మీ పిలుపును ఏర్పాటును నిశ్చయము చేసికొనుటకు మరి జాగ్రతపడుడి 2 పేతు 1 : 10 దేవుడు ఇశ్రాయేలీయుల ఇగుప్తుదాస్యమునుండి విడిపించి ఆశ్చర్యకరముగా నడిపించి అనేకఉపకారములను జరిగించినను వారు అవిధేయులై ఆయన నియమించిన విశ్రాంతిని నిరాకరించుటవలన వారిని 70 ఏండ్లు బబులోను చెరకు అప్పగించెను. నెహె 9 : 25, 26, 35. విశ్రాంతి నైకొనని ప్రజలు లేకపోవుటవలన ఆదేశము 70 ఏండ్లు విశ్రాంతి తీసికొనెను. ద్వితి, 28 : 47, 48 గాన ప్రియుడా ఆరాధన ఆచరించనివారిని ఏమి చేయనైయున్నాడో ఆలోచించుము. ఆదివారమునీవు మీరిఆస్తి నార్జించుచుందుననుకొందువా ? ఆరాబడి చిల్లిసంచిలో వేసినట్లేసుమా ! హగ్గ 1 : 2 - 11. ఇకనైన నీవు నిజవిశ్రాంతిలో ప్రవేశించునట్లు దేవుడు నీకు ఏర్పాటుచేసిన పరిశుద్ధ సంఘూరాధనకు కుటుంబసహితముగా మిమ్మును మీరు శుచిపరచుకొని దేవుని సన్నిధిని అగపరచుకొనుడి. మీదేవుడైన ప్రభువును, నీపూర్ణ హృదయముతోను, నీపూర్ణ మనస్సుతోను, నీపూర్ణ ఆత్మతోను, నీపూర్ణ శక్తితోను, నీపూర్ణ వివేకముతోను, ప్రేమించి

---

"కుటుంబము మానవసునీతికి మంచి పాఠశాలవంటిది" చానింగ్.

"అన్నిస్థలములకంటె కుటుంబము అతిదివ్యమైనది" స్పర్జన్.

సేవించుము. లూక 10 : 25, ద్వితి 11 : 13 విశ్రాంతిదినమును అపవిత్ర పరచకుండ పరిశుద్ధముగా ఆచరించవలెను. యెష. 56 : 1 - 7. లేవి 23 : 32. నెహె 13 : 19

1. మానక సంఘారాధనకు కూడు కొనవలెను. అ. పో. 6 : 4, 2, 20 : 7
2. నీవు, నీ ఇంటివారందరు తప్పక హాజరు కావలెను. నిర్గ 10 : 25, 26
3. వాక్యము చదువుట, ప్రార్థించుటలో శ్రద్ధకలిగి యుండవలెను. నిర్గ. 15 : 26. ద్వితి 6 : 1-9; 11 : 18-20; 1 తిమో 4 : 11-13;
4. బాప్తిస్మము పొందవలెను మార్కు 16 : 16, మత్త 28 : 18-28.
5. ఆయన శరీర రక్తములు (సంస్కారము) పుచ్చుకొను చుండవలెను. 1కొరి 11 : 25-30. 10:16; లూకా 22 : 14-23;
6. క్రైస్తవుడవై క్రీస్తును చూపెట్టవలెను. 1 పేతు. 4 : 16, 2:21
7. దశమ భాగములు, ప్రతిష్టార్పణలు, ఆదివారపు చందాలు క్రమముగా ఇచ్చుచుండవలెను. మలా 3 : 8-10; సామె. 3 : 6-9,

1 కొరి 16 : 1, 2, 8 : 7-13, 2 కొరి 8 : 1-4, 10-15, 9 : 4-12

యెహోవా మందిరమునకు వెళ్ళుదమని జనులు నాతో అనినప్పుడు నేను సంతోషించితిని. దా. కీ. 122 : 1, 42 : 4, మీకా 4 : 2 జఖ 8 : 21 దేవుని మందిరావరణములను చూడవలెనని నా ప్రాణము ఎంతో ఆశపడు చున్నది. అది సొమ్మసిల్లుచున్నది. జీవముగల దేవునిదర్శించుటకు నాహృదయ మును, నాశరీరమును ఆనందముతో కేకలు వేయుచున్నది. దా. కీ. 84 : 2, 63:2 "నాఇంటినిగూర్చినఆశక్తినన్ను భక్షించుచున్నదను" వాక్యమునీయందు క్రియచేయుచున్నదా ? ఎందుకు సంఘారాధనకు వచ్చుటలో వెనుకబడు చున్నావు ? కాబట్టి పరిశుద్ధాలాంకారములతో ఆయన మందిరములో ప్రవేశించి నీ మ్రొక్కుబడులను చెల్లించి, చేతులెత్తి యెహోవాను స్తుతించుడి. దా. కీ. 92 : 13, 116 : 19, 134 : 2, 135 : 2. యెష 66 : 22. ఆదినము (రాకడ) సమీపించుట మీరుచూచినకొలది మరెక్కువసమాజముగా కూడుకొనుడి. హెబ్రి 10 : 24, 25. ఆది సంఘముకూడుకొని దేవుని ఆరా ధించినట్లు (అ. పో. 2 : 46, 4 : 31 18 : 1 - 4) నవీన సంఘమును ఒక ప్రత్యేక స్థలమునందు నియమితకాలములందు సంఘమంతయూకూడి ఘన ముగా ఆరాధించవలెను. కాబట్టి ప్రియచదువరీ నీవు సంఘారాధన యొక్క ప్రాధాన్యత నెరిగి జీవించుట నీకెంతో క్షేమము. "నిన్ను వలె నీపొరుగు వానిని ప్రేమింపవలెనని" ధర్మశాస్త్ర సారాంశమైయున్నది. లేవి 19 : 18 1 యోహా 3 అధ్యా 1. దేవుని ప్రేమించుట 2. పొరుగువారిని ప్రేమించుట

---

"దేవుని ఆరాధించుటయందును. ప్రభువును సేవించుటయందును పరిశుద్ధాత్మ సహవాసమందును, మనము ఆనందించుచుందుముగాక !

H. B. L. వార్డ్.

అనునవి గొప్ప అంశములైయున్నవి. ఇదియే నిజమైన ఆరాధన. ఆరాధన లందు స్త్రీలు ముసుగు వేసుకొని మౌనముగా వినయ భయభక్తులుకలిగి 1 కొరి 11 : 3 - 16 ప్రీతికరముగా ఆయనను సేవించవలెను. అ. పొ. 20 : 19, 1 పేతు 3 : 1 - 9 అల్లరి పనికిరాదు. విస్తరించి మాట్లాడక సమస్త మును మర్యాదగాను, క్రమముగాను జరుగనీయుడి. ఇది యెహోవా యేర్పాటుచేసినదినము. దీనియందు మనము ఉత్సహించి, సంతోషిం చెదము. దా. కీ. 118 : 24. ఈ సంఘారాధనకు చివరగా ప్రభువు నేర్పిన ప్రార్థనతప్పక చేయవలెను. కొందరు బైబిలుజ్ఞానులు మానుకొన్నట్లు, నీవును మానుకొనక నీప్రార్థనాంతమందు ప్రభువు ప్రార్థనచేసికొనుట నీకు శ్రేయస్కరము. నీవు ఆలాగు చేసి అధికముగా ఆశీర్వదింప బడుదువుగాక !

# సింహావలోకనము

మనము కనికరింపబడి, సమయోచితమైన సహాయముకొరకు కృప పొందునట్లు ధైర్యముతో కృపాసనము నొద్దకు చేరుదము. హెబ్రీ 4 : 16

నీకు ఉపదేశము చేసెదను. నీవు నడువవలసినమార్గము బోధించెదను. నీమీద నాదృష్టియుంచి, నీకు ఆలోచన చెప్పెదను. దా. కీ. 32 : 8

నేను యెహోవాయొద్ద ఒక్క వరమడిగితిని. దానిని నేను వెదకు చున్నాను. యెహోవాప్రసన్నత చూచుటకును, ఆయన ఆలయములో ధ్యానించుటకును, నాజీవితకాలమంతయు నేను యెహోవా మందిరమున నివసింపగోరుచున్నాను. దా. కీ. 27 : 4

నీదేవుడైన యెహోవా నీమధ్యయున్నాడు. ఆయన శక్తిమంతుడు. ఆయన మిమ్ములను రక్షించును. ఆయన బహుఆనందముతో నీయందు సంతో షించును. నీయందు తనకున్న ప్రేమనుబట్టి శాంతమువహించి, నీయందలి శాంతముచేత హర్షించును. జఫన్యా 3 : 17.

యెహోవాకృపగలవాడు. ఆయనవాత్సల్యత ఎడతెగక నిలుచున్నది. అనుదినము నూతనముగా ఆయనకు వాత్సల్యత పుట్టుచున్నది. నీవు ఎంతైనా నమ్మదగినవాడవు. విలా. 3 : 22, 23; యోవే 2 : 13; యోనా 4 : 4.

"నీవునన్ను ఆశీర్వదించితేనేగాని, నేనునిన్ను విడువను" ఆది 32 :26

"ఇదిమొదలుకొని నేనుమిమ్ములను ఆశీర్వదించెదను." హగ్గ 2 : 19

"సియోనులోనుండి యెహోవా నిన్ను ఆశీర్వదించును" దా. కీ.128:5

"యెహోవా నిన్ను ఆశీర్వదించి నిన్ను కాపాడునుగాక ! యెహోవా నీకుతనసన్నిధి కాంతిప్రకాశింపజేసి నిన్ను కరుణించునుగాక ! యెహోవా నీమీద తనసన్నిధికాంతి ఉదయింపచేసి నీకు సమాధానము కలుగచేయు గాక !" లేవి 6 : 25

---

"మనకు ఎంతో ఎక్కువగా ఇమ్మని మనము దేవునిఅడుగుచుందుము. గాని ఆయనకు ఎంతో తక్కువగా ఇచ్చుచున్నాము" W. J. హెల్టన్.

# గోధుమ రాశి (జీవాహారము)

## 1. పరిశుద్ధాత్మ.

"ఆత్మపూర్ణులై యుండుడి" ఎఫె. 5 : 18.

(1) దప్పిగొన్నవాఁడు..........జీవజలమును ఉచితముగా పుచ్చుకొనవచ్చును. ప్రక. 22 : 17 (2) నేనుయిచ్చు జలమును త్రాగువాఁడు ఎప్పుడును దప్పిగొనడు. యోహా. 4 : 14. (3) నాయందు విశ్వాసముంచువాని కడుపులోనుండి జీవజలనదులు ప్రవహించును. యోహా. 7 : 37 - 39; యెహె 47 : 1 - 7; జెఖ 14 : 8; యోవే. 3 : 18; ఈ జీవజలము పరిశుద్ధాత్మయే, (4) పరలోకమందు మీతండ్రి తన్ను అడుగువారికెంతో నిశ్చయముగా పరిశుద్ధాత్మనిచ్చును. లూకా. 11 : 9 - 13; యెష. 44 : 3; 32 : 13 - 17. (5) అంత్యదినములయందు నేను మనుష్యులందరిమీద నాఆత్మను కుమ్మరించెదను. అ. కా. 2 : 15 - 18; యోవే. 2 : 28; (6) మీతోను మీలోను ఎల్లప్పుడు వుండుటకై వేరొక ఆదరణకర్తను అనగా సత్యస్వరూపియైన ఆత్మను మీకనుగ్రహించును. యోహా. 14 : 16, 17; (7) నాతండ్రి వాగ్దానముచేసినది మీ మీదకు పంపుచున్నాను. మీరు పైనుండి శక్తిపొందువరకు పట్టణములో నిలిచి కనిపెట్టి యుండుడి. లూకా. 24 : 49; అ. కా. 1 : 4. (8) నేను నీళ్ళలో బాప్తిస్మము నిచ్చుచున్నాను గాని ఆయన పరిశుద్ధాత్మలోను, అగ్నిలోను, బాప్తిస్మమునిచ్చును. మత్త. 3 : 10; మార్కు 1 : 8; లూకా. 3 : 16, అ. కా. 1 : 5, (9) నేనువెళ్ళి ఆయనను మీయొద్దకు పంపుదును. యోహా. 16 : 7. (10) పరిశుద్ధాత్మ మీ మీదికి వచ్చునప్పుడు మీరు శక్తినొందెదరు. అ. కా. 1 : 8, (11) పరిశుద్ధాత్మను పొందుడని వారిమీద వూదెను. యోహా. 20 : 22. (12) వారు పరిశుద్ధాత్మ నింపుదలకొరకు కనిపెట్టుచు ఎడతెగక స్తోత్రముచేయుచుండిరి. లూకా. 24 : 53. అ. కా. 1 : 14. (13) తొలకరివర్షము 120 మందిమీద కుమ్మరించెను. అ. కా. 1 : 15, 2 : 1 - 4, 33, తీతు 3 : 5 - 7 (14) మీరు మారుమనస్సునొంది పాపక్షమాపణ నిమిత్తము ప్రతివాఁడు యేసుక్రీస్తునామమున బాప్తిస్మము పొందుడి. అప్పుడు మీరు పరిశుద్ధాత్మను వరమును పొందుదురు. అ. కా. 2 : 38. (15) దేవుని ఆత్మచేత ఎందరు నడిపింపబడుదురో వారందరు దేవునికుమారులై యుందురు. రోమా 8 : 14. (16) ఎవడైనను క్రీస్తుఆత్మలేనివాఁడైతే వాఁడాయన వాఁడుకాడు. రోమా. 8 : 9 (17) మీరు విశ్వసించునప్పుడు పరిశుద్ధాత్మను పొందితిరా ? అ. కా.

---

"మానవుడు ఎప్పుడు తన హృదయమంతటితో దేవుని ప్రార్థించుట కారంభించునో, అప్పుడు వానిలో పరిశుద్ధాత్మయొక్క అలయకట్టడము ప్రారంభించును." — జే. రిచర్డ్‌బెర్రీ.

19 : 1, 2. (18) కడవరివానాకాలమున వర్షమును దయచేయుమని యెహోవాను వేడుకొనుడి. జఖ. 10 : 1, యాకో. 5 : 7. (19) ఆత్మను పొందినవారు అపోస్తలులు, ఆదిసంఘము. అ. కా. 2 : 33, 42, 46, 11 : 15. పౌలు అ. కా. 9 : 17, 1 కొరి 14 : 18 సమరయవారు అ. కా. 8 : 14 - 17 కార్నేలీయింటివారు. అ. కా. 10 : 23 - 48, 11 : 26, ఎఫెసువారు అ. కా. 19 : 1 - 7. కొరింథువారు 1 కొరి 12 : 13, 3 : 6, 6 : 9, 2 : 11, 12. గాన దైవాత్మనొందునట్లు మోకరించి, ప్రార్థించి, స్తుతించి, కనిపెట్టుము.

"నేను దప్పికగలవారిమీద నీళ్ళను, ఎండినభూమిమీద ప్రవాహ జలములను కుమ్మరించెదను. నీసంతతిమీద నాఆత్మను కుమ్మరించెదను. యెష. 44 : 3, 41 : 17, దా. కీ. 63 : 2, 14 : 3, 6; మత్త. 5 : 6; లూకా 11 : 13, యెష. 11 : 1 - 3. యోహా 16 : 7, 13. 2 తిమో 1:7 కొరి 1 : 30. 1 పేతు 4 : 14, దప్పిగొనినవారలారా ! నీళ్ళయొద్దకురండి" యెష. 55 : 1;

## 2. దైవప్రత్యక్షత.

'నీముఖమునాకు కనబడనిమ్ము నీస్వరము నాకువినబడనిమ్ము' ప. గీ. 2:14

(1) హృదయశుద్ధిగలవారు ధన్యులు. వారు దేవునిచూచెదరు. మత్త. 5 : 8, హెబ్రి 13 : 14. (2) మీరు పూర్ణమనస్సుతో నన్ను వెదకినయెడల మీరునన్ను కనుగొందురు. నన్ను నేను మీకుకనపరచుకొందును. యిర్మి 29 : 13, 14, యెష 55 : 6. (3) మీపూర్ణాత్మతో వెదకినప్పుడు ఆయన నీకు ప్రత్యక్షమగును. ద్వితి 4 : 29, 1దిన. 22 : 19, 28 : 9, సామె 8 : 17, యిర్మి. 24 : 7 (4) మీలో ప్రవక్తయుండినయెడల నేనే దర్శనమిచ్చి మాట్లాడెదను. సంఖ్యా, 12 : 6 (5) నాఆజ్ఞలను అంగీకరించి..........వాటిని గైకొనువాడే నన్ను ప్రేమించువాడు. నేనును వాని ప్రేమించి, వానికినన్ను ప్రత్యక్షపరచుకొందును. యోహా 14 : 21, 23. (6) తనసేవకులైన ప్రవక్తలకు తాను సంకల్పించిన దానిని బయలుపరచకుండ ప్రభువైన యెహోవా యేమియుచేయడు. ఆమో. 3 : 7, ఆది 18 : 17. (7) దేవోక్తిలేనియెడల జనులు కట్టులేక తిరుగుదురు. సామె. 29 : 18, యిర్మి 23 : 22, 23. (8) అబ్రహాముయొద్దకు దేవుడుదిగివచ్చి అతనితో మాట్లాడి భోజనముచేసెను. ఆది. 18 : 1 - 15. (9) యాకోబు .........నేను ముఖాముఖిగా దేవుని చూచితిని. అయినను నాప్రాణము దక్కినది. ఆది. 32 : 30, 33 : 10-19,

" నేనిప్పుడే నేలమీద సాష్టాంగపడి మొరపిడెదను. నీవు నా యొద్దకు వచ్చి నాతోముఖాముఖిగా మాట్లాడువరకు నేను యిచ్చటనుండి లేవను "— ఓరల్ రాబర్ట్స్.

46 : 2. (10) హాగరు నన్నుచూచినదేవుని నేనిక్కడ చూచితిని. ఆది. 16 . 13, 14. (11) మోషేకు తన పేరును తెలిపెను. నిర్గ. 3 : 4, 6 : 3. బాహాటముగా తనసర్వోత్తమత్వమును ప్రత్యక్షపరచెను. దేవుడు మోషేతో గూడ భావనలతోగాక దర్శనమిచ్చి ముఖాముఖిగా మాట్లాడెను. "అతడు నాస్వరూపమును నిదానించిచూచిన ప్రవక్త. సంఖ్యా. 12 : 3, 7 : 8, నిర్గ 19 : 19, ద్వితి 34 అధ్యా (12) నేనైతే నీతిగలవాడనై నీముఖ దర్శనముచేసెదను. నేను మేల్కొనినప్పుడు నీస్వరూప దర్శనముతో నాఆశను తీర్చుకొందును. ఎల్లప్పుడు నీదర్శనము ననుగ్రహించి నన్ను వుల్లాసముతో నింపితివి. దా. కీ. 17 : 15, అ. కా. 2 : 25 - 28 (13) గిద్యోను. న్యాయా. 6 : 22 - 24. (14) సంసోను తల్లిదండ్రులు న్యాయా 13 : 18, 22, 23, (15) సొలోమోను 1 రాజు. 3 : 5, 12 - 15. (16) ఏలియా 1 రాజు 19 : 11 - 14 (17) యోబు 40 అధ్యా. (18) యెషయా 6అధ్యా. (19) సమూయేలు 1 సమూ. 3 : 4, 10, 21, 16 : 17. (20) దానియేలు. 3 : 5, 24 - 29; 7 : 1, 15; 8 : 2, 15, 9 : 21, 10 : 11 (21) అపొస్తులుడైనపౌలు అ. కా. 9 : 3, 2, 22 : 6, 7. 2 కొరి. 12 : 2, 7. గల. 2:2 (22) శిష్యుడైన యోహాను. ప్రక. 1 : 9 - 20, 4, 7, 13, 17. 22 వ-అధ్యాయముగాన పూర్వకాలమందు భక్తులతో దేవుడు విస్తారదర్శనములతో నుపమానరీతిగా మాట్లాడెను. హోషే. 12 : 10 హెబ్రి 1 : 1 ఆయన నిన్న నిరంతరమును ఎట్టిమార్పు లేనివాడు. నేను వారితో నివసించి సంచరింతుననియు 2. కొరి 6 : 16 - 18. క్రీస్తురాకడ కాలములో ప్రవచనము, దర్శనము, కలలుద్వారా మాట్లాడెదననియు యోవే. 2 : 28, అ. కా. 2 : 17 లో వ్రాయబడియున్నదిగదా ! మరి నీకట్టియనుభవము కలుగునట్లు "దేవా ! నాకు కనబడుము, నాతో మాట్లాడుము" అని ప్రార్థించుము. యథార్థవంతులు ఆయన ముఖదర్శనము చేసెదరు. దా. కీ. 11 : 7, 140 : 13 రోమా. 10 : 21. కావున నీదర్శనకాలమందు భక్తిగలవారందరు నిన్ను ప్రార్థన చేయుదురు. దా. కీ. 32 : 6.

## 3. దైవిక స్వస్థత

### "నిన్ను స్వస్థపరచు యెహోవాను నేనే" నిర్గ. 15 : 26.

(1) నేనునీకు మొర్రపెట్టగా నీవునన్ను స్వస్థపర్చితివి. దా. కీ 30:2. (2) ఆయన నీ దోషములన్నిటిని క్షమించి, నీ సంకటములన్నిటిని కుదుర్చువాడు. దా. కీ 130 : 3, 130 : 8. యెష 43 : 25, మీకా 7 : 19. (3)

---

" యెహోవా ఉత్తముడని రుచిచూచి తెలిసికొనుడి. ఆయనను ఆశ్రయించు నరుడు ధన్యుడు"— దా. కీ 34 : 9.

నీమొద్దనుండి నేను సర్వరోగములను తొలిగించెదను. ద్వితి. 7 : 15. (4) గాయములుమాన్పి నీకు ఆరోగ్యమును కలుగజేసెదను. యిర్మి. 30 : 17, 8:22, దా. కీ 147 : 3. (5) నేను దానికి ఆరోగ్యమును, స్వస్థతను మరలరప్పించుచున్నాను. వారిని స్వస్థపరచుచున్నాను. యిర్మి. 33 : 6 (6) ఆయన తన వాక్కును పంపివారిని బాగుచేయును. దా. కీ 107 : 20, 147 : 15, 18. మత్త 8 : 8-13. (7) యెహోవా నీవు నన్ను స్వస్థపరచినయెడల నేను స్వస్థతనొందుదును. నన్ను రక్షించినయెడల నేను రక్షింపబడుదును. యిర్మి 17 : 14. (8) ఆయనే మనలను స్వస్థపరచును. మూడవదినమున ఆయన మనలను స్థిరపరచును. హోషే 6 : 1, 2. (9) నేనునిన్ను బాగుచేసెదను. 2 రాజు 20 : 5, 6. దా. కీ 30 : 3, 56 : 12, 103 : 4. యోబు 33:28-30. (10) బీదలను కటాక్షించువానిని ఆపత్కాలమందు యెహోవా కాపాడి, ఆదరించి, బ్రతికించును. దా. కీ 41 : 1-3. (11) ఆయన పొందినగాయములవలన మనకు స్వస్థతలభించుచున్నది. యెష 53 : 5. 1 పేతు 2 : 24. (12) మృతినొందించువాఁడను, బ్రతికించువాఁడను నేనే! గాయపరచువాఁడను, స్వస్థపరచువాఁడను నేనే! నాచేతిలోనుండి విడిపించువాఁడెవడునులేడు. ద్వితి 32 : 39. (13) నావైపుతిరిగి నావలన స్వస్థతపొందకుండునట్లు వారిహృదయము క్రొవ్వియున్నది. అ. కార్య 28 : 27. మత్త 13 : 15 యెష 6:9,10 (14) నాపాపమునుబట్టి నాయెముకలలో స్వస్థతలేదు. దా. కీ. 38 : 3; 31 : 10, యోబు 33 : 19. (15) నీవు స్వస్థతపొంది, రక్షింపబడునట్లు క్రీస్తు రక్తములో నీసమస్త పాపములను కడిగివేసికొనుము. యిర్మి. 4 : 14 యెష 1 : 16 యాకో 4 : 8 - 10 1 యోహా 1 : 7 - 10; 1 తిమో 1 : 15 (16) యెహోవాయందు భయభక్తులుకలిగి చెడుతనమును విడిచిపెట్టుము. అప్పుడు నీదేహమునకు ఆరోగ్యమును, నీయెముకలకు సత్తువయు కలుగును. సామె. 3 : 7, 8. (17) ఆయనచేతులే స్వస్థపరచును. యోబు 5 : 18. యెష 5 : 18. యెష 30 : 26 (18) అతని రెక్కలు ఆరోగ్యమును కలుగజేయును. గనుక మీరు బయలుదేరి క్రొవ్వినదూడలు గంతులువేయునట్లు గంతులువేయుదురు. మలా 4 : 2 యెష 60 : 1 (19) మహోన్నతునిచాటున నివసించువాఁడే సర్వశక్తునినీడను విశ్రమించువాఁడు. వేటకాని ఉరినుండి నాశనకరమైన తెగులునుండి ఆయనే రక్షించును. ఏతెగులును నీగుడారమును సమీపింపనీయడు. దా. కీ. 91 అధ్యా. నిర్గ 15 : 26. యిర్మి 31 : 13, 14.

---

"మనము ప్రేమతో ఇతరులకు అన్నముగాని, ఉప్పుగాని, బట్టలుగాని, యిచ్చినపుడును, ఏమియులేని వారమైయున్నను చిరునగవుతో ఇతరుల శ్రేయస్సు కోరునపుడును, దేవుని ధననిధులు, మనకొరకు తెరువబడుచుండును"— బెర్నిస్‌బెల్.

దా. కీ. 31 : 7. 85 : 6 మార్కు 16 : 17. లూకా 10 : 17. అ. కార్య 5 : 16, 8 : 7. 16 : 18. 19 : 12. క్రీస్తువారు కుంటి, గ్రుడ్డి, చెవిటి, వివిధ వ్యాధిగ్రస్తులను బాగుచేసెను. దయ్యములను తరిమివేసెను. మృతులను బ్రతికించెను. గాన నీకు స్వస్థత కలుగునట్లు నాలుగుసువార్తలు, అపొస్తుల కార్యములను పట్టుదలతో చదివి క్రీస్తు అద్భుతకార్యములను ధ్యానించుము నీశారీరఆత్మీయ రుగ్మతలనుండి విడుదలనొందునట్లు విశ్వాసముతో ప్రార్థించుము. యాకో. 5 : 13 - 18.

## 4. ఇబ్బందిలో ప్రార్థించుము

## "యెహోవా నాకాపరినాకు లేమికలుగదు" దా. కీ. 23 : 1

మననిత్యజీవితములో వర్షములు లేకపోవుట, కరువులు, రోగములు, వరదలు, తుపానులు, వేడిగాల్పులు, భూకంపములు, అపాయములు, దోపిడిలు, కలుగుచుండును. నీరు, గాలి, ఆహారము, వస్త్రములు, కొరతగలిగి బాధపడుట, ఋణబాధలు, కలహములు, వ్యాజ్యములు. యుద్ధములు, కలిగినప్పుడు, ఎంతో ఇబ్బంది, భయము, శాంతి లేకపోవుట, సంభవించుచున్నది. అట్టిసమయములందు మనపాపస్థితిని ఒప్పుకొని, ప్రార్థించినయెడల మనరక్షకుడైన క్రీస్తు వాటన్నిటినుండి తప్పించి రక్షించును.

(1) యెహోవానిన్ను నిత్యము నడిపించును. క్షేమకాలమున ఆయన నిన్ను తృప్తిపరచి, నీయెముకలను బలపరచును. యెష. 58 : 11, 49 : 10. దా. కీ. 107 : 9. (2) ఆపత్కాలమందు వారు సిగ్గునొందరు. కరువు దినములలో వారు తృప్తిపొందుదురు. దా. కీ. 37 : 19, 33 : 19 (3) ఇబ్బంది కాలములో ప్రభువునీకు ఆహారమును, బాధకాలములో జలమును ఇచ్చును. యెష 30 : 20. దా. కీ, 104 : 15, 147 : 8, 9, 14. (4) కష్టకాలమందు వారు యెహోవాకు మొర్రపెట్టిరి. ఆయనవారి ఆపదలలోనుండి వారిని విడిపించెను. దా. కీ. 107 : 19. (5) ఇరుకునందుండి నేను యెహోవాకు మొర్రపెట్టితిని. విశాలమందు యెహోవానాకు ఉత్తరమిచ్చెను. దా. కీ. 118 : 5. (6) ఆయన దిక్కులేని దరిద్రుల ప్రార్థన నిరాకరింపక వారి ప్రార్థనలవైపు తిరిగియున్నాడు. దా. కీ. 102 : 17 (7) దీనులు భోజనముచేసి తృప్తిపొందెదరు. దా. కీ. 22 : 6. లూకా. 1 : 53 (8) ఆపత్కాలమందు ఆయన తనపర్ణశాలలో నన్ను దాచును. దా. కీ. 27 : 5, (9) దరిద్రులకు కలిగినశ్రమలో వారికి శరణుగాను, గాలి వాన తగులకుండ ఆశ్రయముగాను వెట్టతగులకుండ నీడగాను వుంటివి. యెష 25 : 3 (10) నీవు జలములలోబడి

---

" నేను క్రీస్తును ప్రేమించుచున్నాను. నేడునేను ఆయన శ్రమలో పాలుపొంది, రేపు ఆయన మహిమలో పాలుపొందుదును"— స్టాన్లి. ఏ, ఫ్రై.

దాటునప్పుడు నేనునీకు తోడైయుందును, నదులలోబడి వెళ్ళునప్పుడు అవి నీమీద పొర్లిపారవు. నీవు అగ్నిమధ్యను నడచునప్పుడు కాలిపోవు జ్వాలలు నిన్ను కాల్చవు. నేనే నిన్ను రక్షించువాఁడను. యెష. 43 : 1, 3. (11) ఇత్తడి తలుపులను యినుపఘడియలను పగులగొట్టెదను...............రహస్య స్థలములలో ఉంచబడిన ధననిధులను నీకిచ్చెదను. యెష 45 : 2, 3. (12) యెహోవా పడిపోవువారినందరిని ఉద్ధరించువాడు క్రుంగిపోయిన వారినందరిని లేవనెత్తువాడు. దా. కీ. 145 : 14 (13) దేవుఁడుమనకు ఆశ్రయమును దుర్గమునైయున్నాఁడు. ఆపత్కాలములో ఆయన నమ్మదగిన సహాయకుడు యుద్ధములు మాన్పువాఁడును, విల్లు విరుచువాఁడును, బల్లెమును తెగనరుకు వాఁడును, యుద్ధరథములను అగ్నిలో కాల్చివేయువాఁడును ఆయనే! దా. కీ. 46 : 1, 8, 9. (14) నీయందు భయభక్తులుగలవారి నిమిత్తము నరుల యెదుట నిన్ను ఆశ్రయించువారి నిమిత్తము నీవు సిద్ధపరచి, దాచియుంచిన మేలు ఎంతో గొప్పది. దా. కీ. 31 : 19 (15) దేవుఁడు తన్ను ప్రేమించు వారికొఱకు ఏవి సిద్ధపరచెనో అవి కంటికి కనబడలేదు. చెవికి వినబడలేదు. మనుష్యహృదయమునకు గోచరముకాలేదు. 1 కొరి 2 : 9 "యెహోవా యీరే! ఆది. 22 : 14; 8. అనగా దేవుఁడే చూచుకొనును. మత్త 6 : 31-34.

## 5, ఏడు ఆదిక్యతలు

1. A son— కుమారుఁడు 2 తిమో 2 : 1 దేవకుమారుఁడవై వారసత్వము పొందుము. యోహా 1 : 12 గల 3 : 26 యాకో. 1 : 18 యోహా 3:1,19.
2. A soldier—సైనికుఁడు 2తిమో 2 : 3, 4 సిలువధ్వజముగల సైనికుని వలె సహనముతో శ్రమననుభవించుము. ఎఫె. 6 : 10 - 18 దా. కీ. 45 : 3, 2 తిమో 3 : 12, ఫిలి. 3 : 11, 2 తిమో 1 : 8, 2 : 12
3. A athlete–జెట్టి=మల్లుఁడు 2తిమో 2 : 5 జెట్టివలె నియమప్రకారం పోరుసలిపి, జయముగాంచి బహుమతినిపొందుము. 1 కొరి 9 : 24, 25 కొల 1 : 29 ఫిలి. 3 : 14. హెబ్రి 12 : 1. ప్రక 2 : 7, 11, 17, 27. 3 : 11, 12. కొల 2 : 19. ఆది 32 : 28 హోషే 12 : 3;
4. A Husband man – వ్యవసాయకుఁడు. 2 తిమో. 2 : 6 కృషీవలునివలె పాటుపడి మొదటిఫలములో పాలుపొందుము. యిర్మి 14 : 3. హోషే 10 : 12 యెష 44 : 3,45 : 8, 5 : 1, 2. 27 : 2, 3. 1 కొరి 3 : 8, 9. దా. కీ. 126 : 5 - 7.

---

" డబ్బుపోయిన ఏమియు పోనట్లేయుండును. ధైర్యము పోయిన ఏదోకొంత పోయినట్లేయుండును. గౌరవముపోయిన అధికముగా పోయినట్లుండును. ఆత్మనశించిన అంతయు నశించినట్లేయుండును"— O.B.M.L.B.

5. **A Work man** – పనివాఁడు 2 తిమో 2 : 15 తన పనిని గురించి సిగ్గుపడువాఁడు ఎట్టిఘనతను పొందడు, నీపనియందలి, నిపుణతచేత దేవుని మహిమపరచుము. 1 తిమో 6 : 4, 5 రోమా 6 : 13 ఎఫె. 1 : 13 1 కొరి 6 : 1 - 10 మత్త 6 : 24. ప్రక. 2 : 23, 22 : 12 ప్రస 9 :10.

6. **A Vessel** – పాత్ర 2 తిమో 2 : 21 పరిశుద్ధమైన పాత్రవలె ఆయన ఆలయోపకరణముగ, ఘనముగా వాడబడుము. ఎఫె. 5 : 3 - 14 దాని 5 : 2 - 5, 30; మత్త. 23 : 25 లూకా. 11 : 39 మార్కు 7 : 20–23; 2 తిమో 2 : 22 ఎఫె. 2 : 10 1 పేతు 2 : 5; 1 కొరి 3 : 16, 17, 6 : 19 రోమా. 2 : 1.

7. **A servant** – దాసుఁడు 2 తిమో 2 : 24 దాసునివలె దీనమనస్సు కలిగి సాత్వీకముతో క్రీస్తునుపోలి పరిచర్య చేయుము. లూకా 19 : 10 యోహా. 4 : 32 - 34; ఫిలి 2 : 5 - 10; మత్త. 20 : 28; లూకా 22 : 27; 1 తిమో 4 : 11 - 13; 6 : 11 - 16; 2 తిమో 3 : 17

## 6. నూతనమైనవి

1. నూతన నిబంధన:- హెబ్రి 8 : 8 యిర్మి 31 : 31, లూకా. 22 ; 20, మత్త. 26 : 28, మార్కు 14 : 24, 1కొరి 11 : 25, 1 : 18 21 : 28. 2 కొరి 4 : 3, 4. రోమా 1 : 16, ప్రక 7 : 14, 22 : 14;
2. నూతన సృష్టి:- 2 కొరి 5 : 17 యెహెజ్కే 36 : 25 - 30, 11 : 19, 18 : 31. దా. కీ. 51 ; 10 యోహా 3 : 3, 5.
3. నూతన నామము:- యెష 4 : 3, 62 : 2, 3, 12. 56 : 5. 65 : 15 ప్రక 2 : 17.
4. నూతన మార్గము:- యోహా 14 : 6 హెబ్రి 10 : 19, 20. యెష 35:8,9
5. నూతన గీతము:- దా. కీ. 40 : 3, 33 : 1 - 3, 149 : 1, 98 : 4, 135 : 3 147 : 1, 100 : 4.
6. నూతన యానతి:- యోహా 13 : 34; 1 యోహా 2 : 8, 3 : 15, 4 : 7 8, 20; మార్కు 12 : 30 - 34 రోమా 13 : 8.
7. నూతన యెరూషలేము:- గల 4 : 26 ప్రక 21 : 2 దా. కీ. 19 : 5, 6; 45 : 13 ప. గీ. 1 : 12, 2 : 4 యోవే 2 : 16 యెష 26 : 21
8. నూతన భూమ్యాకాశములు:- ప్రక 21 : 1, 5. యెష. 66 : 22.

---

" ఏవి సత్యమైనవో, ఏవి మాన్యమైనవో, ఏవి న్యాయమైనవో, ఏవి పవిత్రమైనవో, ఏవి రమ్యమైనవో, ఏవి ఖ్యాతిగలవో, వాటిమీద ధ్యానముంచుకొనుడి "— ఫిలిప్పీ 4 : 8.

## 7. బుద్ధిమంతులు

"బుద్ధిగల్గి జీవించుము – బుద్ధి నిన్ను కాపాడును" సామె 2 : 11, 12.

1. బుద్ధివచ్చినప్పుడు వారు తండ్రియొద్దకు వెళ్ళుదురు. లూకా. 15 : 17.
2. జీవమార్గమున నడచుకొందురు. సామె. 15 : 24.
3. బండమీద తమయింటిని కట్టుకొందురు. మత్త 7 : 24, 25.
4. సిద్దెను నూనెతో నింపి, వెలిగించి, ఆయనకొరకువేచియుందురు మత్త25:7.
5. అపవాదిని ఎదిరించి గెలుతురు. 1 పేతు 5 : 8 యాకో 4 : 7.
6. శ్రమలయందు కాపాడబడుదురు. ప్రక 3 :10 యెష 26 : 21.
7. ప్రఖ్యాతినొంది ప్రవర్తించెదరు. దాని. 6 : 3, 10 : 11, 1 : 8, 17.
8. పరమందు జ్యోతులవలె ప్రకాశించెదరు. దాని. 12 : 3.

## 8. యాగములు

1. బలి యాగము:- ఆది 3 : 21, 8 : 20, 22 : 13, నిర్గ 29 : 18 లేవి 1 అధా. సంఖ్యా 28 : 6, 7; హెబ్రి 9 : 13, 14 : 28, 10 : 10 - 14, 1 పేతు 1 : 18, 19.
2. సజీవ యాగము:- రోమా 12 : 1, 6 : 13, 8 : 13, 1 కొరి 6 : 20. 1 పేతు 1 : 14, 2 : 11, 5.
3. విశ్వాస యాగము:- ఫిలి 2 : 17, 1 తిమో 6 : 12, 2 తిమో 4 : 7, 1 పేతు 2 : 6
4. స్తుతి యాగము:- హెబ్రి 13 : 15, దా. కీ. 50 : 14, 23, 33:1,147:1
5. ఉపకార యాగము:- హెబ్రి 13 : 16, రోమా 12 : 13.
6. మనోహర, సువాసన యాగము:- ఫిలి 4 : 18, 19, 2 కొరి 2 : 14, 15.
7. దేవునికి యిష్టమైన బలులు:- దా. కీ. 51 : 17, 34 : 18, హోషే 14 : 2. 1 తిమో 2 : 1 - 3.

## 9. వస్త్రములు.

1. రక్షణ వస్త్రము:- యెష 61 : 10, 63 : 1 - 3, దా. కీ. 132 : 16, ప్రక 7 : 14
2. నీతి వస్త్రము:- యోబు 29 : 14, 27 : 5, 6, దా. కీ. 132:9 ఎఫె6:14.
3. స్తుతి వస్త్రము:- యెష 61 : 3 యిర్మి 17 : 27, దా. కీ. 69 : 30, 100:4.
4. సంతోష, ఉల్లాస వస్త్రము:- యెష 61 : 3, దా. కీ. 30 : 12.
5. ప్రశస్త వస్త్రము:- లూకా. 15 : 22, 23, 11, జెఖ. 3 : 4, 5.
6. శోభిత వస్త్రము:- యెష 63 : 1, 52 : 1.

---

"మనము క్రీస్తువలె ప్రవర్తించుటద్వారానే మనయందున్న దేవుని ప్రేమకును, ఆయన కార్యములకును, సాక్ష్యమియ్యగలము" ....నానా పే. యోహెర్

7. పెండ్లి వస్త్రము:- మత్త 22 : 11, 12, దా. కీ. 45 : 8 ప్రక 19 : 8;
8. మహిమ వస్త్రము:- మార్కు 10 : 3, 4, ప్రక 4 : 4, 6:11; 2 కొరి 5:2,
ప్రక 3 : 18, 7 : 9, 16 : 16, 1 పేతు 5 : 5.

## 10 కి రీ ట ము లు.

1. ముండ్ల కిరీటము:- మత్త 27 : 29 మార్కు 15 : 17, 18. యోహా 19:5
2. సువర్ణ కిరీటము:- ప్రక 4 : 4, 19 : 12.
3. జీవ కిరీటము:- యాకో. 1 : 12; ప్రక 2 : 10.
4. నీతి కిరీటము:- 2 తిమో 4 :8.
5. అక్షయ కిరీటము:- 1 కొరి 9 : 25.
6. ఆనంద కిరీటము:- 1 థెస్స 2 : 19.
7. మహిమ కిరీటము:- 1 పేతు 3 : 4.

## 11. ఏ డు న డ క లు.

1. వాక్యముతో:- ప్రక 22 : 7. లూకా. 11 : 28, 8 : 21.
2. ప్రేమతో:- ఎఫె 5 : 2; కొల 3 : 12 - 17; రోమా 8 : 37 - 39;
3. సత్యముతో:- 3 యోహా 1 : 3, 4; 2 యోహా 1 : 4; 2 కొరి 13 : 8;
4. విశ్వాసముతో:- 2 కొరి 5 : 6, హెబ్రి 11 : 13; 1 కొరి 13 : 13;
5. ఆత్మతో:- గల 5 : 16; 25;
6. జీవముతో:- రోమా 6 : 4, 22;
7. ఆయనకు తగినట్లు- కొల 1 : 12, ప. గీ. 7 : 1

## 12. దే వు ని హ స్త ము.

1. స్వస్థపరచు హస్తము:- మార్కు 1 : 41, యోబు 5 : 18, యెష 30 : 26.
2. సహాయముచేయు హస్తము:- యెష 41 : 10.
3. కాపాడు హస్తము:- యెష 49 : 15, 16.
4. తోడుగానుండు హస్తము:- ఎజ్రా 8 : 22.
5. మనలను చెక్కుకున్న హస్తము:- యోహా 10 : 28.

## 13. సు వా ర్త లు.

1. కృపా సువార్త:- రోమా 1 : 1, 2 కొరి 10 : 24, అ. కార్య 20 : 24
2. నా సువార్త:- రోమా 2 : 16, 1 కొరి 9 : 16.
3. భిన్నమైన సువార్త:- గల 6 : 17, 2 కొరి 11 : 4.

---

నేను క్రీస్తునందు దేవునియొద్దకు పోవుమార్గమును కనుగొనలేక పోయిన యెడల నా సకలప్రయత్నములును నిరర్థకములే—A. W. ముమెర్ట్స.

4. నిత్య సువార్త:- ప్రక 14 : 6, 12.
5. రాజ్య సువార్త:- మత్త 24 : 14, ప్రక 20 : 4 - 6, 1 : 6, 5 : 10,

## 14. మూడు శిలువలు

(1) గలతి 5 : 24, (2) రోమా 6 : 6 (3) గల 6 . 14.

## 15. ఎల్లప్పుడు.

1. ఎల్లప్పుడు ప్రార్థించుము — ఎఫె 6 : 18.
2. ఎల్లప్పుడు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుము — ఎఫె 5 : 20.
3. ఎల్లప్పుడు ప్రభువునందు ఆనందించుడి — ఫిలి 4 : 14.
4. ఎల్లప్పుడు కృపాసహితముగా మాట్లాడుము — కొల 4 : 6.
5. ఎల్లప్పుడు ప్రభువు కార్యాభివృధియందు ఆశక్తి కలిగియుండుము. — 1 కొరి 15 : 58.
6. ఎల్లప్పుడు విజయోత్సవముతో...........నడపబడుము 2 కొరి 2 : 14.
7. ఎల్లప్పుడు ఆయనకిష్టమైన కార్యములను చేయుము 2 కొరి 2 : 14.
8. ఎల్లప్పుడు విధేయులై యుండుడి ఫిలి 2 : 12.

## 16. జాగ్రత్తగా చూచుకొనుడి.

1. ఏమి వింటున్నారో—మార్కు 2 : 24.
2. ఏలాగు వింటున్నారో—లూకా 8 : 18.
3. కనిపెట్టి ప్రార్థించుము—మార్కు 13 : 33.
4. ఎట్లు కనిపెట్టుచున్నారో - 1 కొరి 3 : 12.
5. చెడ్డహృదయము కలుగునేమో - హెబ్రి 3 : 12.
6. పడిపోదురేమో - 1 కొరి 10 : 12.
7. లోభత్వమునుగూర్చి - లూకా 12 : 15.
8. నీ విషయమై నీవే - 1 తిమో 4 : 16.

## 17. క్రీస్తు అప్పగించెను.

1. ఆయన సంచిని - యూదాకు - యోహా 13 29.
2. ఆయన వస్త్రములు - రాణువవారికి - యోహా 19 : 23.
3. ఆయన ఆత్మను - దేవునికి - లూకా 23 : 46.
4. ఆయన దేహము - యోసేపుకు - యోహా 19 : 38.
5. ఆయన తల్లిని - యోహానుకు - యోహా 19 : 27.

---

పగతీర్చుటయందు మనకు సమాధానము దొరకదు. క్రీస్తునామమున క్రీస్తు మనస్సుతో క్షమించుటయందే సమాధానము గలదు.—ఆస్టిన్ఫ్రా చాప్మన్,

## 18. యేసు నాల్గుఆజ్ఞలు

1. వెళ్ళుము నీకు కలిగినది అమ్మి బీదలకిమ్ము మార్కు 10 : 21.
2. వెళ్లుము దేవుడునీకు చేసినగొప్ప వాటినిచెప్పుము మార్కు 5 : 19.
3. వెళ్లుము మిమ్ములను మీరుచూపించు కొనుడి లూకా 17 : 14.
4. వెళ్లుడి క్రైస్తవులను చేయుడి మత్త 28 : 18.

## 19. మిద్దెలు.

"ఇంటిమిద్దె మీదఉండు వాడుదిగకూడదు" మత్త 24 : 17.
మిద్దె = ఉన్నతస్థితి. ఆత్మఫలములతో నిండినది గల 5 : 22.
పరసంబంధమైనవి కొలస్సె 3 : 1, 2, ఫిలి 4 : 8.

1. యెరూషలేమునుండి ఎరికోకుపోరాదు. లూకా 10 : 30 - 35 యెష 4 : 3; యోహా 6 : 26, 1 రాజు 16 : 34, 2 పేతు 2 : 20 - 22.
2. దావీదుమిద్దె 2 సమూ 11 : 1 - 5, 27. మార్కు 11 : 35. ఆది 28 : 10 ఎఫె 6 : 12.
3. యోసేపుమిద్దె — ఆది 39 : 12 హెబ్రి 12 : 1 - 3, ప్రక 18 : 4.
4. రాహాబుమిద్దె — యెహో 2 : 6, 6 : 25.
5. సమూయేలు, సౌలు మిద్దెమీద గడుపుట 1సమూ 9 : 25, 26;
6. దానియేలు ఇంటి పైగదియందు దేవుని ప్రార్థించి, స్తుతించెను. దాని 6 : 10 ఎలీషా మేడగది 2 రాజు 4 10.
7. క్రీస్తు శిష్యులకు మేడగదియందు సంస్కారమిచ్చుట. మార్కు 14 : 15 ఆత్మకొరకు కనిపెట్టుట. అ. కార్య 1 : 13, 2 : 1 పేతురు మిద్దెపై దర్శనము పొందుట. కార్య 10 : 9 పౌలు మేడపై కార్య 20 : 8.

## 20. దండములు.

1. యాకోబు చేతికర్ర — ఆది 32 : 10 హెబ్రి 11 : 21.
2. మోషే చేతికర్ర — నిర్గ 4 : 1 - 14, 20, 14 : 16, 17 : 5 సంఖ్య 20:9
3. అహరోను కర్ర — సంఖ్య 17 : 8 హెబ్రి 9 : 4.
4. దావీదు చేతికర్ర — 1 సమూ 17 : 40 - 43.
5. యోనాతాను చేతికర్ర — 1 సమూ 14 : 27, 29 దా. కీ. 119 : 105,130
6. ఎలీషా దండము 2 రాజు 4 : 29.
7. నా (దేవుని) చేతికర్ర — మీకా 7 : 14 యెష 40 : 11.

నీదుడ్డుకర్ర - నీ దండము దా. కీ. 23 : 4 రెండు దేహాధారములు

---

మానవునియొక్క ముమ్మరమైన దుస్థితి యే దేవుడువానిని రక్షించుటకు గల అవకాశము—హారి, ఎస్, కింగ్.

లూకా 10 : 35 రెండుకత్తులు లూకా 22 : 36, 38 (పాత నిబంధన క్రొత్త నిబంధన) ద్వితి 6 : 4 - 9, 11 : 18 హెబ్రి 4 : 12 దా. కీ. 45 : 3, 149 : 9, ప్రక 19 : 13 హెబ్రి 13 : 20 ఎఫె 6 : 17 యిర్మి 23 : 29.

8. రాజ దండము = ఎస్తే 5 : 2 ప్రక 2 : 27. దా. కీ. 45 : 6

## 21 ఫలములు

1. మారుమనస్సుకు తగిన (రక్షణ) ఫలములు మత్త 3 : 7, 8, లూకా 3:8
2. వెలుగు ఫలములు — ఎఫె 5 : 9 రోమా 13 : 12 మత్త 5 : 16.
3. నీతిఫలము — యాకో 3 : 18; యేష 32 : 17; ఫిలి 1 : 11;
4. ఆత్మ ఫలములు — గల 5 : 22 యోహా 15 : 2, 8

## 22 అసహ్యమైనవి ఏడు సామె 6 : 16-19.

1. అహంకారదృష్టి — గొల్యాతు 1 సమూ 17 : 10.
2. కల్లలాడునాలుక — అననియ, సప్పీరా అ కార్య 5 : 1-11,
3. నిరపరాధిని చంపుచేతులు — అహాబు, ఎజిబెలు; నాబోతు 1 రాజు 2: 16
4. దురాలోచన యోచుంచు హృదయము-సౌలు-దావీదు 1 సమూ 18 :20-29
5. కీడుచేయుటకు పరుగెత్తుపాదములు — యూదులు - క్రీస్తును శిలువ వేయుట లూక 22 : 47—53;
6. లేనివాటిని కల్పించు అబద్దసాక్షి - అబ్షాలోము 2 సమూ 15 : 1-6;
7. అన్నదమ్ములలో జగడముపుట్టించుట - కయీను హేబెలు ఆది 4 : 7

## 23. ద్రోహులు

1. గురుద్రోహి - యూదా యిస్కారియోతు అ. కార్య 1 : 18
2. నమ్మకద్రోహి - యోవాబు - 2 సమూ 3 : 27.
3. రాజద్రోహి - జిమ్రి - 1 రాజు 16 : 20.
4. యజమానిద్రోహి — పెకహు - 2 రాజు 15 : 25
5. పితృ ద్రోహి — అబ్షాలోము - 2 సము 16 : 11.
6. మాతృ ద్రోహి — రూబేను - ఆది 35 : 22; 49 : 3, 4.
7. భ్రాతృ ద్రోహి — కయీను - ఆది 4 : 8.
8. మిత్ర ద్రోహి — అహీతోఫెలు - 2 సమూ 15 : 31, దా. కీ. 41 : 9, 55 : 12 - 14.

---

మనము ఇతరులకు సహాయముచేయుటద్వారా మనకుమనమే సహాయము చేసికొనుచుందుము.—మిసెస్ ఫాల్.

## 24. తుఫానులు.

1. యోనా ఓడమీదికివచ్చినతుఫాను - యోనా 1 : 4; దా. కీ. 107 : 25-31
2. శిష్యులు, ప్రభువున్న దోనెపైకివచ్చిన తుఫాను - మత్త 8 : 23 - 27 మార్కు 4 : 35 - 41.
3. ప్రభువులేని దోనెపైకివచ్చిన తుఫాను - మత్త 14 : 22 - 33 యోహా 6 : 16 - 21.
4. పౌలుఉన్న ఓడమీదికివచ్చిన తుఫాను - అ. కార్య 27 : 1 - 31 దా. కీ. 65 : 7.

## 25. యేసునాల్గురెట్లుశక్తి.

1. తుఫాను మీద – మార్కు 4 : 39. 2. దయ్యాల మీద–మార్కు 3 : 11.
3. వ్యాధుల మీద – మార్కు 5 : 29. 4. సాతాను మీద–మార్కు 5 : 18.

## 26. దేవుడు ప్రేమించెను.

1. తల్లి వలె – యెష 66 : 13. 2. తండ్రి వలె – దా. కీ. 103 : 13.
3. సోదరుని వలె, స్నేహితుని వలె – సామె 18 : 24;

## 27. వేషధారులు.

1. సౌలురాజు – 1 సమూ 28 : 8; 12 : 19;
2. యరోబాాముభార్య – 1 రాజు 14 : 2, 6 - 12, 17;
3. ఒకప్రవక్త – అహాబు - 1 రాజు 20 : 38 - 43:
4. అహాబురాజు – 1 రాజు 22 : 30 - 40; 2 దిన 18 : 29 - 34;
5. యోషీయారాజు – 2 దిన 35 : 22 - 27;
6. అయ్యో వేషధారులైన శాస్త్రులారా మీకు శ్రమ మత్త 23 : 13 - 39;
7. గొఱ్ఱెచర్మము కప్పుకొన్న తోడేళ్ళు. మత్త 7 : 15 - 23; యెష 29:15 మార్కు 12 : 15; మత్త 6 : 2, 5, 16, 7 : 5; 24 : 51; 1 యోహా 2 : 1 - 6; 1 పేతు 2 అధ్యా.

## 28. క్రీస్తు సిల్వపై పలికిన ఏడుమాటలు.

1. "తండ్రీ, వీరినిక్షమించుము." లూకా 23 : 34;
2. "నేడు నీవు నాతోకూడ పరదైసులో నుందువు." లూకా 23 : 43;
3. "అమ్మా, ఇదిగో నీకుమారుడు." యోహా 19 : 26, 27;

---

నేనుబ్రతికె ప్రతినిమిషమును దేవుని సన్నిధానమున నే బ్రతుకవలసి యున్నది. నేను ఆయన సన్నిధిని తప్పించుకోలేను.—విల్లియం. జే. స్మిత్.

4. "నాదేవా, నాదేవా, నన్నెందుకు చెయ్యివిడిచితివి." మత్త 27 : 46; మార్కు 15 : 34;
5. "నేను దప్పిగొనుచున్నాను." యోహా 19 : 28;
6. "సమాప్తమైనది." యోహా 19 : 30.
7. "తండ్రీ, నీచేతులకు నాఆత్మను అప్పగించుచున్నాను." లూకా 23:46;

## 29. ధనాపేక్ష.

1. ధనాపేక్ష సమస్తకీడులకు మూలము. 1 తిమో 6 : 10;
2. దుర్లాభాపేక్ష - ప్రస 5 : 10 - 12, యెహె 33 : 31, హబక్కూ 2 : 9 - 11.
3. అన్యాక్రాంతము - యెష 5 : 8; మీకా 2 : 1 - 3 యిర్మి 22 : 17;
4. లంచములు - 1 సమూ 8 : 3, సామె 15 : 27, 17 : 8; యెహె22:17.
5. ధనవంతునిస్థితి - లూకా 12 : 15 - 21; 16 : 19 - 31; 18 : 24-26;
6. అన్యాయపు గృహనిర్వాహకుడు. లూకా 16 : 1 - 13 యాకో 5:1-6 ఎఫె 5 : 5, 1 కొరి 5 : 10, 6 : 10, కొల 3 : 5, 1 యోహా 2:15-17 హెబ్రి 13 : 5 నిర్గ 20 : 17; రోమా 13 : 9 యెహె 25 : 26, 35; హోషే 3 : 7;
7. ధనాపేక్షకులు - (1) లాబాను. ఆది 31 : 41; (2) బిలాము సంఖ్య 22 : 7, 21; 2 పేతు 2 : 15; యూదా 11, 16; (3) ఆకాను యెహో 7 : 21 (4) సౌలు 1సమూ 15 : 9, 19; (5) అహాబు 1 రాజు 21 అధ్యా (6) గెహాజీ 2 రాజు 5 : 20 - 27; (7) యూదామత్త 26 : 14; (8) అననీయ, సప్పీరా - కార్య 5 : 1-11 (9) పేలిక్సు కార్య 24 : 26; (10) లోతు భార్య ఆది 19 : 26; గానప్రియుడా ధనాపేక్షను విసర్జించి నీతిని, భక్తిని, విశ్వాసమును, ప్రేమను, ఓర్పును, సాత్వికమును, సంపాదించుకొనుటకు ప్రయాసపడుము 1 తిమో 6 : 3 - 21; మత్త 6 : 19-34;

## 30. క్రీస్తు రెండవ రాకడ

1. రెండవరాకడను సూచనలు - మత్త 24 : 3 - 31; మార్కు 13 : 3 - 31; లూకా 12 : 49 - 59, యెహె 7 : 19 నహూ 2 : 4 (వస 12 : 12, 1 : 18; మీకా 7 : 6; 2 తిమో 3 : 1 - 9 రోమా 1 : 28 - 32 మీకా 7 : 3 - 6 దా.కీ 14:1; 53 : 1; లూకా 21 : 10-28 మత్త 21 : 19 జెక 10 : 8, 8:10; దా.కీ. 2 : 3, యెష 4 : 1;1థెస్స2:3-12;

---

మనము క్రీస్తుపక్షమునను, ఆయన సంఘముపక్షమునను నిలువబడినప్పుడే మన జీవితపు ఉద్దేశము సరియైనదిగామారును.—జే. హీంత్ తొమోసన్.

2. పెండ్లి విందుకు ఆహ్వానము - మత్తై 22 : 1 - 14; లూకా 14 : 24;
3. పెండ్లి కుమారునివలె క్రీస్తు వచ్చును మత్తై 25 : 6 యోవే 2 : 16 ప్రక 19 : 7, 9
4. ఇంటియజమానుని వలెవచ్చును - మార్కు 13 : 32 - 37;
5. తనదాసులయొద్ద లెక్కలు అప్పగించుకొనుటకు క్రీస్తు వచ్చును మత్తై 25 : 14 - 30; లూకా 16 : 1 - 13; 19 : 1 - 27;
6. మీరనుకొననిఘడియలో దొంగవచ్చినట్లు క్రీస్తువచ్చును. మత్తై 24:32-51; లూకా 12 : 35 - 48;
7. క్రీస్తురాక మెరుపువలె యుండును. లూకా 17 : 24 - 27;
8. ఆదినము గర్భిణీస్త్రీకి ప్రసవవేదన వచ్చినట్లుండును. 1 థెస్స 5 : 3;
9. అకస్మాత్తుగా ఉరివచ్చినట్లు లూకా 21 : 34; ప్రక 16 : 16;
10. కలవరపడకుడి నేనువచ్చి మిమ్మును గొనిపోదును. అ. కా 1 : 11; యోహా 14 : 1 - 3; థెస్స 4 : 16 - 18 యెష 40 : 31, 60 : 8 ప. గీ. 6 : 10; వచ్చువాడు ఆలస్యముచేయక వచ్చును. హెబ్రి 10:37; ప్రక 1 : 3, 7; 3 : 11, 22 : 7, 12 20. ప్రభువైన యేసూరమ్ము.

సమాధానకర్తయగు దేవుడే మిమ్మును సంపూర్ణముగా పరిశుద్ధపరచును గాక ! మీఆత్మయు, జీవమును, శరీరమును, మన ప్రభువైన యేసుక్రీస్తు రాకడయందు, నిందారహితముగాను, సంపూర్ణముగాను, వుండునట్లు కాపాడబడునుగాక ! 1 థెస్స 5 : 23.

"యెహోవా విమోచించినవారు పాటలుపాడుచు తిరిగి సీయోనుకు వచ్చెదరు, వారితలల మీదనిత్యా నందముండును" యెష 35 : 9.

" మనప్రభువైన యేసుక్రీస్తు కృపమీకు తోడైయుండునుగాక "



ఎవరు తమసేవను తమకు కలిగినదానిని సంతోషముతో సమర్పించు కొందురో వారిని ప్రభువు బహుగా ప్రేమించును—గై ఈస్నెస్లీ.

# సుభాషితములు

1. " పరిశుద్ధాత్మ శక్తి నన్నావరించితే నేతప్ప సన్నిధిగదినుండి లేవననియు, ప్రసంగ పీఠము నెక్కననియు శపథముచేస్తిని " —ఓరల్ రాబర్ట్సు.
2. " భగవంతుడు యిచ్చిన ఈ జీవితాన్ని ఇష్టమొచ్చినట్లు వాడటానికి మీకు అధికారములేదు " —ఫాదర్ డఫీ.
3. " ఒకడు ధనహీనుడై దరిద్రుడుగా నుండవచ్చును, గాని దుర్బుద్ధియైన ధనికుడు ఆబీదవానికంటె ఎంతో దరిద్రుడు "
4. " సాత్వీకగుణము బలహీనత కాదుగానియది క్రీస్తునందు మనకు గొప్ప బలము " —ఈ కేత్, డిటేరిచ్.
5. " హృదయముతో గాక ఎక్కువగా తలతో ఆలోచించి సిద్ధపరచబడిన ఒక ప్రసంగము వినువారికి శక్తివంతముగానుండదు " —రిచర్డ్ శిసిల్.
6. " దైవభక్తిగల క్రైస్తవ కుటుంబములో వివరింపనలవికాని యొక గొప్పశక్తి తాండవమాడుచుండును " —క్రిటేజ్.
7. " ప్రార్థనయొక్క విలువ మీరెరుగుదురు అది ప్రశస్తమైనది. ప్రార్థన ఎప్పుడును నిర్లక్ష్యముచేయకుము " —సర్ తామస్ బక్స్టన్.
8. బోధకునికిని, విశ్వాసికినిగల భేదమేమి ? " ఒకబోధకుడు ఒకమంచి విశ్వాసికంటె నాల్గురెట్లు ప్రార్థించును " —స్పర్జన్.
9. బుద్ధిహీనులపాటలు వినుటకంటె, జ్ఞానులగద్దింపు వినుట మేలు ప్రస 7:5;
10. సాత్వీకమైన నాలుక ఎముకలను నలుగగొట్టును. సామె 25 :15;
11. బాలుడు నడువవలసినత్రోవను వానికి నేర్పుము. వాడువృద్ధుడైనప్పుడు దానినుండి తొలిగిపోడు. సామె 22 : 6;
12. ఘనతకుముందు వినయముండును. నాశనముకుముందు గర్వము నడచును. సామె 15 : 33; 16 : 18;
13. బీదలను వెక్కిరించువాడు వారిసృష్టికర్తను నిందించువాడు సామె17:5;
14. "భూలోకములో యదార్థముగా దేవునికొరకు ప్రయాసపడుట తప్ప లోకములో నాకేమిపనిలేదు" —బ్రెయినార్డ్.
15. "సంఘపు ఆయుధాగారములో ప్రార్థన ఒకబలమైన ఆయుధము. ప్రార్థనచేయు మనుష్యులే శక్తి సంపన్నులు."
16. "సత్యసాక్షి సిద్ధాంతమును విమర్శించును. సామాన్యుడు సేవను విమర్శించును. నీచుడు మనుష్యుని విమర్శించును."
17. "వాని మూఢతచొప్పున మూర్ఖునికి ప్రత్యుత్తరమియ్యకుము ఇచ్చిన యెడల నీవును వానిపోలియుందువు." సామె 26 : 4.
18. యోగ్యురాలు పెనిమిటికి కిరీటము సిగ్గుతెచ్చునది వానియెముకలకు కుళ్ళు. సామె 12 : 4;

19. అందము మోసకరము సౌందర్యయు వ్యర్థము. యెహోవాయందు భయ భక్తులుగల స్త్రీ కొనియాడబడును. సామె 31 : 30;
20. మేలునకు కీడుచేయుట దయ్యములక్షణము. కీడునకు కీడుచేయుట పశులక్షణము. మేలునకు మేలుచేయుట మానవ లక్షణము. కీడుకు మేలు చేయుట దైవ లక్షణము."
21. "ప్రసంగించుట పదిమందికి నేర్పుటకంటే ప్రార్థించుట ఒకనికి నేర్పుట నేను యిష్టపడుచున్నాను."—జోవెట్.
22. "తనలో ఉష్ణములేనివాడు ఇతరులకెట్టు వెట్టపుట్టించగలడు ?"-స్విఫ్ట్
23. "హృదయ సౌందర్యంలేని భౌతికసౌందర్యం పరిమళంలేని ప్రసూనం లాంటిది."—వెర్రహా
24. "స్త్రీకిగాని పురుషునికిగాని సౌశీల్యమే నిజమైన ఆభరణము."—మహాత్మ గాంధీ.
25. "ధైర్యవంతుడు ఒకేసారి చస్తాడు." పిరికివాడు అనేకసార్లు చస్తాడు. షేక్స్పియర్.
26. 'సత్యం' చీర సింగారించేలోగానే 'అసత్యం' భూప్రదక్షిణ చేసి వస్తుంది.—జూన్ ప్లోమాక్.
27. "విశ్వాసపాత్రుడైన మిత్రుడు భగవంతుని అపరావతారం"—నెపోలియన్.
28. "పదవి, అధికారము మానవునిశీలానికి అమోఘమైన అగ్నిపరీక్షలు. అవి అతనిలో ప్రతిఉద్వేగాన్ని పైకిఉబుకజేసి, లోపలఎక్కడో దాగి యున్న దుస్వభావములనుగూడ వెదకిపట్టుకొని బయటపెడతాయి."—ప్లూటార్క్.
29. "కరుణామయహృదయం, కనక కిరీటముకంటె ఘనమైనది." టెన్నిసన్
30. మనము క్రీస్తుకు శిష్యులముగానుండుట సులభమైనపనికాదు. గానియది మహామహిమతోగూడిన పనియైయున్నది. —ఫ్రాన్సికోఈ. ఎస్టెల్లో.
31. నన్ను రక్షించి నడిపించుటకు ఈలోకమునకు వచ్చియున్న క్రీస్తును నేను అంగీకరించి వెంబడింతును.—అల్బెర్టు. ఎఫ్. హార్మ్సన్.
32. నేను ప్రతిదినమును నాసిలువనెత్తుకొని దేవుడు నాకొరకు వేసియున్న మార్గమందు నడచుదును.—హిసాయోకిటాని.
33. ఎవరికి ఈబ్రతుకునందు తమ ఆత్మలలో పరలోకానుభవముగలదో వారు యిప్పటినుండిమే పరలోకమున ప్రవేశించి నిత్యజీవము ననుభవించుచున్నారు.—హెన్రీవార్డు బీచర్ ఎట్విన్ టీ ఇగిల్ హార్టు.
34. నేను క్రీస్తును వెంబడింతును. ఆయనే నన్ను దేవునియొద్దకు నడిపించును. జెన్నూటన్ వైజ్.

35. మనము క్రీస్తుతో కలిసి యున్నయెడల ఎట్టి కష్టపరిస్థితినైనను గెలువ గలము. .... గిల్బర్టు. 2.ఎల్. రామ్సే.

36. సత్యము ఒక విశాలమైన వృక్షము. దాని సేవ చేయగలిగినయెడల దాని నుండి అనేక ఫలములు లభించును. సత్యమునకు అంతులేదు. దాని లోతునకు ప్రవేశించినకొలది. దానినుండి రత్నములు లభించుచుండును. సేవచేయు క్షేత్రమింకను విశాలమగుచుండును.—మహాత్మ గాంధీ.

## వి జ య ము

37. ఎప్పుడైనను, నీవు ఎట్టిభోజనముతోనైనను, వస్త్రములతోనైనను, శీతోష్ణస్థితితోనైనను, ఏకాంత స్థలముతోనైనను తృప్తిపడి యుండిన నదియే విజయము.

38. ఎట్టి విరోధమునైనను, తొందరనైనను, అక్రమునైనను. వేళతప్పి యుండుటనైనను (వాటికి కారణము నీవుకానపుడు) నీవు సహించగల్గిన యదియే విజయము.

39. నీవు మరచిపోబడినప్పుడు, ప్రాముఖ్యత నీయబడనప్పుడు, నిందలపాలైనప్పుడు, నీయంతరంగమునం దుత్సహించుచు నింద, తృణీకారములం దెల్లప్పుడు ఆనందించుటయే విజయము.

40. పాపముతోను, భోగముతోను, ఆత్మ త్యాగముతోను, శ్రమతోను, నీవు యెదుర్కొన్నప్పుడు క్రీస్తుయేసు ఓర్చుకొన్నట్లు, ఓర్చుకొన గలిగినచో నదియే విజయము.

41. నీసంభాషణయందు నిన్ను గూర్చి యెప్పుడును ముచ్చటించుకొనవో, నీయొక్క ఉత్తమక్రియలను ఎప్పుడు పాటించవో, మంచి సిఫారసు కొరకెప్పుడు ప్రాకులాడవో, ఎప్పుడైతే నీవు యదార్థముగా అమాయకత్వమును ప్రేమింతువో అప్పుడే విజయము.

42. నీయొక్క మంచితనము చెడు దూషించబడినప్పుడు, నీకోరికలు ఫలించనప్పుడు, నీయిష్టము కొట్టివేయబడినప్పుడు, నీసలహా త్రోసివేయబడినప్పుడు, నీయాలోచనలు తృణీకరించబడినప్పుడు, నీవు అవియన్నియు, ఓర్పుతోను, ప్రేమతోను, సహించినచో అదియే విజయము—(Selected)

43. నన్ను దేవునినుండి వేరుపరచు సమస్తము పాపమే. -విన్ ఫ్రెడ్ గ్రేబర్.

44. "రచించడంవల్లనే నీవు రచన నేర్చుకుంటావు" - జాన్ సన్.

45. "పక్షులను మనతలలపై యెగురనివ్వండిగాని, వాటిని మనతలలపై గూళ్ళు పెట్టనివ్వకండి."

46. మనము దేవునిచే ఏర్పరచుకొనబడిన సంతానమును, ఆయన స్వజనులమునై యున్నాము — ఐ - మాటూర్.



# ఆదరణకర్తస్తుతి

దైవాత్మరమ్ము - నా తనువున(ప్రా)ణాలుగను - నా =
జీవమంతయు నీతో నిండ - జేరివసింపుము

1. స్వంతబుద్ధితోను - యేసు - ప్రభుని నెరుగలేను - నే =
నెంతగ నాలోచించిన విభుని - నెరిగిచూడలేను ॥దైవాత్మ॥
2. స్వంతశక్తితోను - యేసు - స్వామిజేరలేను - నే =
నెంతనడచిన-ప్రభునికలిసికొని-చెంతజేరలేను ॥దైవాత్మ॥
3. పాపస్థలమునుండి - నీసు వార్తకడకు నన్ను - భువి=నో
పరమాత్మ నడుపుచుండుము-ఉత్తమస్థలమునకు ॥దైవాత్మ॥
4. పాపములో మరల - నన్ను - పడకుండగ జేసి - ఆ =
నీ పరిశుద్ధమైన రెక్కల - నీడను కాపాడు ॥దైవాత్మ॥
5. పరిశుద్ధునిజేసి - నీ - వరములుదయజేసి - నీ =పరిశుద్ధసన్ని
ధినిజూపుము - పూర్ణమా ... ॥దైవాత్మ॥
6. తెలివిని గలిగించు - నన్నుదివ్యాగ వెలిగించు - నీ
కలిగిన భాగ్యములన్నిటిని నా - కంటికిజూపించు ॥దైవాత్మ॥
7. నన్నును భక్తులను - నెనాడును కృప ... - స్థల = మన్నిం
చుము మా పాపరాసులను-మాపివేయుమిలను ॥దైవాత్మ॥
8. వందనములు నీకు - శుభ - వందనములు నీకు - ఆ =
నందముతో కూడిన నాహృదయ-వందనములునీకు ॥దైవాత్మ॥

## స్తుతి గానము

స్తుతిజేతుమునీకు - దేవస్తుతిజేతుము నీకు = గతియించెను
కీడెల్లనుగాన - స్తుతిగానము జేయుదుమో తండ్రి ॥స్తుతి॥

1. వేడుకొనక ముందే - ప్రార్థన వినియుంటివి దేవా = నేడును రేపును
నెల్లప్పుడు సమ - కూడును స్తుతిగానము నీ కిలలో ॥స్తుతి॥
2. మనసును నాలుకయు నీకు - అనుదినస్తుతి జేయున్ = జనకుడ మా
రాత్మల స్తోత్రము - ఘనతయు మహిమయు కలుగును గాక ॥స్తుతి॥

( ఫాదర్ యం, దేవదాసు అయ్యగారివి. )

1. ఘటసర్పము:- ప్రకటన గ్రంథముపై నొకనవీన వ్యాఖ్యాన గ్రంథము 100 పేజీలలో వ్రాయబడినది. ఇంపురత్నము, రెండవరాకడ, ఏడేండ్ల శ్రమలచరిత్ర, అంతిక్రీస్తు, అబద్ధప్రవక్త, హార్మగెద్దోనుయుద్ధము, గోగుమాగోగుయుద్ధము, అంత్యతీర్పు, నిరంతరదైవరాజ్యము మొదలగు 34 అంశములతో కూర్చబడినది. వెల 0-10-0 మాత్రమే.

2. ధ్యానమంజరి:- ఇయ్యది ప్రార్థనాజీవితమునకు చాలా ఉపయుక్తముగానుండును, వేదభాగములందుగల ప్రాముఖ్య ధ్యానాంశములను భక్తులసూక్తులతో సంధించి 64 పేజీలలో వ్రాయబడినది. వెల 0-8-0 మాత్రమే. వలయువారు:— ఈక్రింది అడ్రసునకు ముందుగా డబ్బు పంపుటద్వారా, వి.పి. ల ద్వారా పుస్తకములను బడయగలరు. పోస్టుఖర్చులు అదనము.

కృతజ్ఞత:- ఈ ఉత్కృష్టదైవకార్యమున నాకు సహాయపడిన మిత్రులకు, విశ్వాసులకు, ఆంధ్రరత్న పవర్ప్రెస్ వారికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

నా అడ్రస్


యస్. ఇశ్రాయేలు (పారోనుగృహము)

ప్యాడిసన్‌పేట, తెనాలి (గుంటూరు జిల్లా)


3. పుస్తకములు ప్రాప్తి స్థానములు.

1. రెవ. కె. ఇశ్రాయేలుగారు - హనుమాన్ పేట - విజయవాడ.
2. యం. జాషువాగారు - మందపాడు - గుడివాడ, కృష్ణాజిల్లా.
3. కంచెర్ల దేవసహాయముగారు - శేకూరుపాలెం, గుంటూరు జిల్లా.
4. తాడిబోయిన ప్రకాశరావుగారు - స్టేషన్ రోడ్, తెనాలి
5. ఈద ప్రకాశముగారు - గుండుగొలను - ప|| గో|| జిల్లా.

4. రానున్న మా ప్రచురణలు.

1. పరమ గీతార్థ రహస్యం 2. పరిశుద్ధాత్మాభిషేకము
3. దైవ ప్రత్యక్షత 4. దైవిక స్వస్థత. 5. ప్రసంగ ప్రకాశిని


ముద్రణ : ఆంధ్రరత్న పవర్‌ప్రెస్, తెనాలి-2